*

ఆంధ్రరత్నం

# దుగ్గిరాల

*



*

రచయిత

రాధాకృష్ణుడు

*

౧

*

* *

పండితుడు, రసజ్ఞుడు, కవి, గాయకుడు, కళారాధకుడు, దేశసేవా తత్పరుడు, నిష్కామయోగి, బ్రాహ్మణ మతవ్యాపకుడు... అన్నిటినీ మించి ఆంధ్రపుత్రుడు.

అతని సాహచర్య సౌఖ్యం, అతని వాగమృతాబ్ధిని క్రీడించే సంతోషం, అతని పాదపద్మాల నర్చించే సౌభాగ్యం... నా యీ భౌతిక శరీరానికి 'నాస్తి.' అతని యశోవల్లరి కృశింవనంత కాలం, అతని ఆత్మ తేజం అణగిపోనంత కాలం, అతని ఆకారానికి కాలప్రాకారం అడ్డురానంత కాలం, అతని సుధామయోక్తులకు ప్రాధాన్యం పోనంత కాలం, అతని ఆశయ నిర్ఝరులు ఆంధ్రావనీ విహారం ఆపనంత కాలం... అతడు నా కాదర్శప్రాయుడు. నా ఆరాధ్య దైవతం. నా అంజలి గ్రహించటానికి అర్హుడు.

అతని దర్శనభాగ్యం గ్రహించిన నానేత్రద్వయం, ఆతని సహావంక్తిని కూర్చోగలిగిన నా యీ కాయం, అతని ప్రేమపూరిత దృగంచలంలో నిలిచిన నా లేత హృదయం... ఆ ఒక్క దివ్యముహూర్తంలో శతసహస్ర వర్షాలకి సరిపోయే ధన్యత స్వీకరించినై. అతడు... ఎవరో కాదు... ఆంధ్రరత్నం గోపాలకృష్ణుడు. అందుకనే యీ రాధాకృష్ణుని— ఏకలవ్యశిష్యుని— అంజలి.

*     *

*

మొదటి

# ఇరవైయేండ్లు

"సీ॥ వేదాంతముల తోడ వెక్కిరింతలతోడ
లెక్కలేక సాగించు లీలనెవఁడు
లక్ష్యమొక్కటి లేక యక్షగానములతో
కాలంబు వృథబుచ్చు ఘను డెవండు
చీరాల పేరాల చిన్నిగ్రామంబుల
దోసమెంచక కొంపదీసె నెవఁడు
ఆంధ్రరత్నంబంచు నహమికతో బెద్ద
పిన్నలంచును మదినెన్న డెవఁడు
[ఆంధ్రరత్నంబంచు నధమపక్షము నుంకి
కొండడై యరికోటి జెందు నెవఁడు]
.............................
............................."

అతడే గోపాలకృష్ణుడు. అందుకనే...దైవం......

"అట్టిగోపాల కృష్ణుని హాస్యసరళి
గోలకృష్ణునిగా జేసి కొంత దీర్చె"

అంతేనేగాని, అదే తప్పినట్టైతే, అతడు చెప్పుకున్నట్టుగా యే 'గాడ్డు' కీ గూడా అతడ్ని పట్టుకోటానికి పగ్గాలు దొరికేవికావు; ముమ్మాటికీ అతడంతటి ఘనుడు.

పెనుగంచిప్రోలు అనే పల్లెలో, వెల్నాటివైదీకి బ్రాహ్మణకుటుంబంలో, సీతమ్మా కోదండ రామస్వాములకు అల్లారు బిడ్డడై, విరోధినామ సంవత్సర జ్యేష్ఠశుద్ధ చతుర్థినాడు (జూన్ 2. 1889 న) ఉద్భవించాడు. పుట్టుకనిచ్చిన తల్లికి పెంచి పెద్దచేసే భాగ్యం దక్కిందికాదు. అతని జీవితానికి సరిపడే సద్గుణజాలాన్ని మూడు రోజులపాటు చనుబాలద్వారా యిచ్చి, తన పని యీ

లోకంలో నెరవేరిందన్నట్టుగా కళ్ళుమూసుకుంది. కళత్ర విహీనుడైన తండ్రి మరిమూడేళ్ళు సాకాడు. అంతటితో అతనికీ ఋణం తీరిపోయింది. ఈ అనర్థాలన్నీ చూట్టానికి బ్రతికి ఉంది ఓ అవ్వ: యీ పాపడి నాయనమ్మ. అవ్వగారి ఆదరాభిమానా లందుకుని, పితృశ్రీ పోషణ క్రింద గుంటూరులోనూ, కూచిపూడి గ్రామంలోనూ బాల్యదశ పూర్తి చేసుకుని, విద్యార్థిగా తయారైనాడు, గోపాలకృష్ణుడు. సత్కళలన్నీ సహజంగా, పూర్వజన్మంలో చేసుకున్న పుణ్యంమూలాన అలవడ్డాయి కాని బలవంతంగా సంపాదించాలనుకుంటే లభ్యంకావు. పాండిత్యం, రసజ్ఞత, కవిత్వం, గానం... యివన్నీ గోపాలకృష్ణుని జన్మహక్కులైనై. దైవభక్తి వాటన్నిటినీ మెరుగుపెట్టింది. ఇవన్నీ సమకూర్చుకున్న అతని ప్రతిభ అతణ్ని ఒక నాయకాగ్రణిగా తయారుచేసింది. కాని, కాలం కాని కాలంలో పుట్టడంచేత అతని సామర్థ్యమంతా 'అడవి గాసిన వెన్నెలై' పోయింది. అడవిలో ఐనా

నెన్నెల యేకొన్ని ప్రాణాలకో హాయినిస్తూనే ఉంటుంది; ఏ ఒక్క ప్రాణికైనా కష్టాన్ని కలిగిస్తూనే ఉంటుంది. అలానే ఇతని జీవితంకూడా జరిగిపోయింది..

డబ్బుగలవాడికి మామూలుగా చదువుసాగదుట. నిజమే. రెండుకత్తులు ఒక ఒరలో యెలా యిముడుతై? భోగాలనుభవిస్తూ ఉంటే చదువు... గుంటపట్టి గంటవాయిస్తుంది; చదువుపైనే ధ్యాసఉంటే సర్వసంగ పరిత్యాగం జరుగుతుంది. అదేవిధంగా... కళాభిరుచి కల వాళ్ళకీ, కళాశాల విద్యార్థులకీ నువ్వంటే నువ్వే అనే సంబంధం వుంటుంది; సామాన్యంగా.

గోపాలకృష్ణుడు మెట్రిక్యులేషన్ పరీక్ష కోసం రెండు దండయాత్రలు చేశాడంటే ఆశ్చర్యం దేనికి? ఆ కాలంలోనే అంటే 1907 లోనే బాపట్లలో నేషనల్ థియేటర్ అని ఓ నాటకాల కంపెనీ పెట్టారు. తనకు వచ్చినా రాకపోయినా, ప్రజకి, చక్కని జాతీయ విద్య

నేర్పాలన్న కుతూహలంతో, 'నేషనల్ ఫండ్' అని, ఓసం స్థని సృష్టించాడాయె. వీటికీ చదువుకీ ఏమాత్రమన్నా సంబంధం. ఉందా? ఇవన్నీ ఆరోజుల్లో సాగే కార్యాలేనా? 'గుడిమింగే వాడొకడూ, గుళ్ళోలింగాన్ని మింగే వాడింకొకడూ' అన్నట్టుగా- అతడ్నీ, అతడి చర్యల్నీ కనిపెడుతూ, కొద్దికొద్దిగా ఐనా అర్థంచేసుకుంటూ- ఉన్న అతని పినతండ్రి కట్లో అట్టే కారంకొట్టడం అంత తేలిక పనేనా? గోపాలకృష్ణమార్జాలం కళ్ళుమూసుకునే పాలు తాగిం దనుకుందాం; ఆ పినతండ్రి ప్రపంచం చూస్తూ ఊరుకుంటుందా? సరే...'అబ్బాయీ! నీకీ గుంటూరు పనికిరాదోయ్! బాపట్లలోనే ఉండి చదువు సాగించమన్నాడు, ఆయనగారు. ఆయనమాట కెదురు లేకుండా బాలకృష్ణుడు బాపట్ల చేరాడు. ఆ సంవత్సర మే మెట్రిక్యులేషన్ పరీక్షలో ఉత్తీర్ణుడైనాడు.

అవి, మూడోక్లాసుప్యాసైతే ముప్ఫైరూపాయిలు దొరికే రోజులు. పరీక్షలుకాగానే, తాలూకా కచ్చేరీలో

గుమాస్తాగిరి దొరికింది, గోపాలకృష్ణయ్యకి. అదృష్టం చూడండి. ఉద్యోగంలో చేరిన నాలుగైదు నెలల్లోనే యింటికి ఉత్తరం రాశాడు... 'వీధివీధీ, యిల్లిల్లూ తిరిగి తిరిపె మెత్తుకోవడం, యీ సర్కారు ఉద్యోగం చెయ్యటంకంటె మంచిదని నాకు తోచింది' అని. ఆ ఉత్తరం ఊరు చేరిందో లేదో ఉద్యోగానికి స్వయంగానే ఉద్వాసన చెప్పుకున్నాడు.

కొద్దికాలం గడిచింది. కళాశాలలో చేరాడు. 'ఎంత కాలం అధ్యాపకులకు ఆయాసం కలిగిస్తా'ననుకున్నాడు గాబోలు; వెంటనే దానికీ స్వస్తిచెప్పేశాడు.

ఆ రోజుల్లోనే, గుంటూరు మిషన్ స్కూల్లో ఓ ఉపాధ్యాయుడు కావలసి వచ్చాడు. సరే ... యిదికూడా యత్నించి వదుల్దా మనుకున్న గోపాలకృష్ణయ్యకి అది లభించనూ లభించింది; మూణ్ణాళ్ళ మురిపెం పొంది చెల్లుచీటీ పుచ్చుకోనూ పుచ్చుకుంది. ఆపై విషయా

లన్నీ చూస్తుంటే ఎవరికైనాసరే; యిదేమిటా... ఇతని జీవితమంతా ఇంతటి చంచలంగా ఉంది, అన్న విచారం కలుగుతుంది; కాని, కొద్ది ఓపికపట్టి విచారిస్తే తిరిగి ఆమాట అనిపించదు; ఇదే పరివర్తన అన్నివిష యాల్లోనూ కనిపించి మంచి నవ్వొస్తుందికూడా.

1907–1908 సంవత్సరాల్లో, బెంగాల్‌నుంచి వచ్చిన స్వరాజ్య పరిభంజనం గోపాల కృష్ణయ్యలో కొంత మార్పు తెచ్చింది. అప్పటినుంచీ అతడు రాచకీయ రంగంలో దిగాడనే చెప్పాలి. 1909లో, బందరులో జరిగిన ఆంధ్రవిద్యార్థి సమాజం తరఫున "జాతీయత... కళ" అని, కొన్ని ఘూమైన ఉపన్యాసా లిచ్చాడు.

సామాన్యంగా పోయేఅతన్ని, ఓమెట్టుపైకి— ఉపన్యాస వేదిక మీదికి— యెక్కించింది, జీవితంలో అదే ప్రథమముహూర్తం అనిపిస్తుంది.

ఏ గ్రహబలమో చెప్పలేం... కాని, 1911 లో, అత నికి అనుకోకుండా ఓ సహాయం జరిగింది. బాలకృష్ణుని విద్యాభ్యాసానికి భారతభూమి చాలింది కాదు. ఉన్నత విద్యకోసరమని ఉప్పునీరు దాటిపోవాలనుకున్నాడు. ఆంగ్లభాషా వ్యాసంగానికై ఇంగ్లండు చేరుకున్నాడు. అప్పటికే, అష్టవర్ష ప్రియంగల (1903-11) బాంధవ్యం సంపాదించుకున్న గృహలక్ష్మిని— దుర్గాభవానమ్మని— దూరంచేసి, ఆంగ్లదేశంలో దొరకుతుందనుకునే ఆశ యలక్ష్మికోసరం పయనమైనాడు.

ఆంగ్లరాజ్య సంచారం ఐదేళ్ళు పట్టింది. ఆకాలంలో చాలాభాగం స్కాట్లండులోనూ, ఎడింబరో లోనూ గడిచింది.

ఎడింబరోలో హైందవేయుల సంఘం (ఇండియన్ ఎసోసియేషన్) ఒకటివుంది. దానికి కార్యదర్శిగా ఎన్నికో

బడ్డాడు; గోపాలకృష్ణయ్య. 1915వ సంవత్సరంలో తిలక్ మహాశయుడు మాండలేనుంచి విడుదల చేయబడ్డాడని గ్రహించిన ఆసంఘం గోపాలకృష్ణుని ప్రోత్సాహంతో పెద్దఉత్సవం జరిపింది. దాంతో పాశ్చాత్యరంగంలో కూడా భారత జాతీయ సంగ్రామంలోగల వెచ్చదనం తెలిసివచ్చింది.

ఆసంవత్సరంలోనే అతడు గాంధిజీని లండన్‌లో కలుసుకుని, తన అభిమానాన్ని వెల్లడించాడు. అప్పుడే, గాంధిజీ ఒక అవతార పురుషుడన్న అభిప్రాయం కలిగిందతనికి. అదే 1921 లో భారత దేశంలో ప్రచారం చేశాడు.

అతని వ్యక్తిత్వం అక్కడకూడా అతన్ని వదిలిపెట్టింది కాదు. ఆసందర్భంలో కొన్ని ఆహ్వానపత్రికలు కాబోలు అచ్చు వేయాల్సివచ్చింది. అందరూ తలో

విధంగానూ తమ తమ అభిప్రాయాలు తెలుపుకున్నారు. గోపాలకృష్ణుడు అన్నీవిని, చివరికోవిధంగా నిర్ణయానికి తీసుకువచ్చాడు. పసుప్పచ్చ కాగితం కొందాం. దాని మీద ఆకుపచ్చ సిరాతో అచ్చువేయిద్దాం. దానిమూలంగా హిందూ మహమ్మదీయ సఖ్యత వ్యక్తమౌతుంది. అంతనేగాని, ఏదో తోచినట్టుగా చేస్తే, దానికి ప్రాముఖ్యం వుండదు', అని వాళ్లందరికీ నచ్చచెప్పి అలాగే చేయించాడు.

11,000 రూపాయిలూ, ఐదుసంవత్సరాలూ, వ్యయించి శ్రమించిన గోపాలకృష్ణయ్యకు దక్కిన ఫలం అత్యల్పం. అతనికి అర్థశాస్త్రి మంటే అతినిర్లక్ష్యం. అర్థశాస్త్రి విజ్ఞానమంటే, విధ్వంసకమాత్రి శాస్త్రివిజ్ఞానం అని అతని భావన. (Science of Econamics is the science of Destruction.) అటువంటి భావంగల అతనికి ఆ అర్థశాస్త్రింలోనే ఎమ్. యె. అనవస్స పట్టం వచ్చింది. పిల్ల

ంతో పాటు కొన్ని నగలన్నట్టుగా శారీరక శాస్త్రంలోనూ, వైద్యశాస్త్రంలోనూ కూడా రెండు డిప్లమోలు — అంటించుకోటానికి కూడా అర్హత లేనివి — దక్కినై.

1916 వరకూ గోపాలకృష్ణుడు పాశ్చాత్య దేశాల్లోనే ఉన్నాడు. మిస్ క్రిసెల్ సెమిచ్ అనే ఓ బెల్జి వాస్తవ్యురాలితోనూ, డాక్టర్ ఆనంద్. కె. కుమారస్వామి అనే ఓ పెద్ద అధికారితోనూ అతని కక్కడే పరిచయం కలిగింది. శిష్యురాలుగా స్వీకరించి సెమిచ్ కన్యనూ, గురునిగా భావించి స్వామిగారినీ చేరాడు. ఆ సంబంధాలు మాత్రం గోపాల కృష్ణుని జీవితంలో మరువరానివీ...మరపు రానివి కూడా ఐనై.

మిగిలిన

# పన్నెండేళ్లు

గోపాలకృష్ణుని జీవితశేషం, యింకా పన్నెండు వేసంగులు. స్వలాభానికిగాని, జాతీయాభ్యుదయానికిగాని, దేశస్వాతంత్ర్యానికిగాని అతడేమైనా చేసిఉంటే, అదంతా కూడా యీపన్నెండేళ్ల కాలంలోనే అనిపిస్తుంది.

శతాయువై, ఒక్కొక్క ఆశయాన్ని ఒక్కొక్క నిర్ణీత సమయంలో సిద్ధింపచేసుకుని, దేశకళ్యాణానికి దోహదమిచ్చి, పరిపక్వమైన ఫలాన్ననుభవించాల్సిన గోపాలకృష్ణుని జీవితం—అనుకోని విధంగా, పరిపూర్ణత్వం పొందకుండా, ఎందుకూ, సంపూర్తిగా వినియోగపడక కాటికన్నూరి చేతికి చిక్కిం దంటే, 'సుకృతీగతాయుః' అన్నసూక్తి వ్యర్థంకాదని తేల్తుంది. ఏవోకొన్ని

సత్కార్యాలు మాత్రమే చెయ్యాల్సినవిధి అతనికీ, అతనులేని కొఱతకు కృంగిపోవాల్సిన దౌర్భాగ్యం దేశ ప్రజకూ ఉండటంచేతనే, అట్టి అవాంతరం జరిగి ఉంటుంది.

ధనాఢ్యులకీ, పెద్దపెద్ద వేతనాలు స్వీకరించే సర్కారుద్యోగులకీ ఉదకమండలం వేసంకాలంలో విశ్రాంతిస్థలం. ఎక్కడెక్కడినుంచో పెద్దలందరూచేరి,ఆరెండుమాసాలూ అక్కడనివసిస్తారు. వాళ్ళందరూ పెద్దలే (గౌరవనీయులే) గదా అనుకుని, పొట్టపట్టుకునితిరిగే జీవాలు మెన్నో అక్కడకు చేరుతూఉంటై. 1917 లో, గోపాలకృష్ణయ్యగూడా, యేఉద్యోగమైనా దొరక్కపోదని అక్కడికే వెళ్లాడు. ప్రథమంలో డాక్టర్ పట్టాభిని కలుసుకుని, ఆంధ్రజాతీయకళాశాలలో ఉద్యోగం యిప్పించాలిసిందని కోరాడు. ఆయాచనకి కారణం అతనికిబాల్యంనుంచీ ఉన్న జాతీయసేవాభిలాష మాత్రమే ననుకోవాలి.

ఆ దినాల్లో, ఆసంస్థలో ఖాళీలే లేవో, ఉన్నా, గోపాల కృష్ణునివంటి గ్రజేండాన్ని భరించటం సులభసాధ్యం కాదనే అనుకున్నాడో, యదార్థం తెలియదు గాని, పట్టాభిమాత్రం గోపాలకృష్ణుని కనుకూలంగా జవాబియ్యలేదు. బ్రూస్ రాజూ—సాలీడు (King Bruce and the Spider) ల కథ బాల్యంలో చదివిందైనా, గోపాల కృష్ణయ్యజీవితంలో అది అడుగడుక్కీ జ్ఞప్తికివచ్చే విషయం గా పరిణమించింది. పట్టాభిగారు పనియ్యలేదే అని నిరాశ చెందకుండా, అక్కడేవున్న సర్. అలెగ్జాండర్ అనే ఓ దొరగారి దర్శనార్థం వెళ్లాడు.

ఆయన ఆరోజుల్లో రెసిన్యూ మెంబరుగా ఉంటున్నాడు. గోపాలకృష్ణయ్య ఆయన్ని కలుసుకుని, స్వాగతం అందు కుని, కుశలప్రశ్నలు వెయ్యసాగాడు. ఆ సందర్భంలో అలగ్జాండరుగారు 'మీరెవరు?' అని అడిగారు. జబాబుగా గోపాలకృష్ణయ్య, 'బ్రాహ్మణులం' అన్నాడు. ఆమాట

దొరవారిని నవ్వించింది. ఆ నవ్వు గోపాలకృష్ణయ్య గుండెలో మంటలా ఉబికింది. బ్రాహ్మణకులం అన్నం తట్లోనే ఇంత నిర్లక్ష్యంగా, అసభ్యంగా, మొరటుగా ప్రవర్తిస్తాడా అని అసహ్యంవేసి, అక్కడనుంచి లేచి పోవటానికి యత్నించాడు. అతడిభావం అలగ్జాండర్ గారికి అర్థమైంది. వెంటనే లేచి, పిలిచి,కూర్చోమని బ్రతిమాలి, 'చూడండి, మిమ్మల్ని నీరసంగాచూడటం నా అభిప్రాయంకాదు......యదార్థానికి మాకు బ్రాహ్మణజాతంటే బహుగౌరవం ఉంది...నిజానికి మాకు కావలసిందికూడా బ్రాహ్మణులే...మీ జాతినిగురించి మీ కెటువంటిభావం ఉందో గ్రహించటానికే అలా అన్నాను...క్షమించండి'--అని ప్రాధేయపడ్డాడు. అలా అతణ్ని శాంతింప చెయ్యటమే కాకుండా, కొద్దిరోజులకే 'స్టోక్' అనే మరో దొరగారితో మాట్లాడి, మద్రాసు ఎడ్యుకేషనల్ సర్వీసులో చేర్పించి, 200 రూపాయిల

మాసవేతనంమీద రాజమండ్రీ గవర్నమెంటు ట్రైనింగ్ కాలేజీలో అధ్యాపకునిగా నియమింప చేశాడు.

ఈ సందర్భంలోనే గోపాలకృష్ణుని బ్రాహ్మణమత తత్వాన్నిగూర్చి కొద్దిగా విచారిద్దాం.

మచిలీపట్నంలో ఓసారి ఉపన్యసిస్తూ... బ్రాహ్మణులైనవారు స్వయంగా వడికిన నూలుతో తయారైన బట్టలు ధరించాలనీ, అహింసావ్రతం అవలంబించాలనీ, అస్పృశ్యతను రూపుమాపాలనీ, త్రాగుడు మానాలనీ ఘంటాపథంగా చెప్పాడు. అద్వైత సిద్ధాంతాన్ననుసరించేవాడే బ్రాహ్మణుడేనని అతని తాత్పర్యం. 'ఓం'అనే అక్షరంతో ప్రారంభిస్తుంది గాయత్రి. ఆ 'ఓం' అనే దానికే శాస్త్రాలు బ్రహ్మ అంటాయి. ఆ మంత్రమే మానవుణ్ణి సాధారణ మార్గంలోంచి బ్రహ్మమార్గానికి తీసుకువెళుతుంది. పుట్టిన పిల్లలందరూ శూద్రులే. కాని, ఉపన

యనకాలం అని నిర్ణయించి, గాయత్రీ మంత్రోపదేశించి, ఉచ్చరింపచెయ్యగానే, వాళ్ళు, బ్రాహ్మణులౌతారు. అదే వాళ్ళకి పునర్జన్మ. కనుక, గాయత్రీ మంత్రోపదేశం పొందిన వాళ్ళందరూ బ్రాహ్మణులౌతారనే చెప్పాలి. బ్రహ్మజ్ఞానం పొందటమనేదే భారతదేశంలో ప్రతిమానవునికీ ఆదర్శం. బ్రహ్మని గ్రహించటానికి యత్నించే వాళ్లందరూ బ్రాహ్మణులే ఔతారు కనుక, భారతభూమి అంతా బ్రాహ్మణ కుటుంబమే. బొట్టు, కట్టు, తిండి, మొదలైన వాటిల్లో, యథేచ్ఛగా, యెవరిజాతికి సంబంధించినట్లుగా వారు నడుచుకోవచ్చును, కాని, గాయత్రీఉపదేశం పొందితీరాలి.

బ్రాహ్మణుడైనవాడు, తనఆత్మలో, సర్వజీవుల్లోనూ వుండే పరమాత్మని గుర్తించాలి. సర్వప్రాణులపట్లా సమత్వాన్ని కుదుర్చుకోవాలి. అరిషడ్వర్గాలనీ జయించి, వేదాభ్యాసంద్వారా, తపస్సుద్వారా, ఆత్మపరీక్ష

చేసుకుని, తానెవరో తెలుసుకోటానికై యత్నించాలి. ఆ పరీక్షా కాలంలో, యజ్ఞయాగాదిక్రతువులు ఆచరింపక పోయినా దోషం కాదు.

ఆత్మానాత్మ విచక్షణ చెయ్యగలవాడే బ్రహ్మజ్ఞాని. ఆత్మ అనేది మనలో ఉండేశక్తి. రెండోది, పాంచభౌతికమైన దేహం. దేహంమీద రక్తికలిగించి, ఎక్కువగా అభిమానింపచేస్తూ, 'నా' అనే లోనిశక్తిగా భావింపచేస్తూ, ఆత్మచ్యుతిని కలిగించేదే భవబంధం. ఆ భవబంధవిమోచనం ఐతే, మోక్షంసిద్ధించినట్టే. మోక్షానికే ముక్తి అని మరో పేరుంది. బ్రహ్మచర్య, గార్హస్త్య, వానప్రస్త, సన్న్యాసాలు నాలుగూ బ్రాహ్మణుని జీవితఘట్టాలు. ఒకఘట్టంలోంచి మరొకఘట్టంలోకి పోవటానికి యీ చతురాశ్రమాలూ దారిచూపిస్తై. అలా సవ్యంగా ఆచరిస్తే, ముక్తిసులభసాధ్యం ఔతుంది. అంటే, అగుపించని,అక్షయమైనబ్రహ్మతో ఏకత్వం లభిస్తుందన్నమాట.

పరిస్థితం, బ్రాహ్మణమతం క్షీణించి పోయింది. మంత్ర బలం పాడైపోయి, తంత్రబలంయెక్కువైంది. ధర్మ మత పోక్తులమని చెప్పుకునేవారి ఔదార్య రాహిత్యంవల్లా, క్షమావిరహితమైన ఆచారాలవల్లా, అసలే జాతిమూరులైన ఖండాలురపట్ల వారుచూపే దౌర్జన్యంవల్లా అదిసంభవించింది. అందుచేతనే, మానసికమైన విజ్ఞానం కొఱవడిపోయింది.

బ్రాహ్మణులూ, అబ్రాహ్మణులూ, హిందువులూ, మహమ్మదీయులూ, క్రైస్తవులూ, బౌద్ధమతస్థులూ అందరూకూడా జాతి, మత వివక్షతలు లేకుండా, స్త్రీ,పురుష, బాల, వృద్ధ భేదాలు లేకుండా, ఆత్మ సాక్షాత్కారానికే ప్రయత్నిస్తూ ఉంటారు. సర్వ మతాలవారూ యత్నించేది ఒకే ఒక గమ్యస్థానానికి చేరుకోటానికే; కాని, ఒక్కొక్కరు ఒక్కొక్కమార్గాన వరిస్తూ ఉంటారు. అన్నిమార్గాలూ సవ్యమైనవే.

అందరిఆశయాలూ ఒకటే. కాబట్టే, ప్రపంచానికంత టికీ ఒకేఒక ఆదర్శప్రాయమైన మతం ఉండటం అవసరం.

బ్రాహ్మణజాతి యేనాడూ రాజ్యపాలనం చేసింది లేదు. బ్రాహ్మణేతరులు పరిపాలించారు. మహమ్మదీయులు అధికారం చెలాయించారు. సిక్కులు, మొన్న మొన్ననే ప్రభుత్వాధికారాన్ని వదులుకున్నారు. ఎవరు పరిపాలించినప్పటికీ, యెవరిచేతుల్లో యే అధికారం ఉన్నప్పటికీ, బ్రాహ్మణులకు మాత్రం అచంచలమైన గౌరవస్థానం ఉండనే ఉంది. బ్రహ్మోప దేశం చేయగలవాడూ, అజ్ఞానాంధకారంలో ఉన్న జీవులకు ఆ వెలుగు దివ్వె చూపించి, తద్వారా తాను గౌరవంపొంది అన్యులకు ముక్తి మార్గం చూపేవాడూ బ్రాహ్మణుడొక్కడే అన్నది యేనాడో నిర్ధారింపబడ్డ విషయం. ప్రతిజీవీ కూడా బ్రహ్మజ్ఞానోపార్జనచేసి బ్రా

హ్మణత్వం పొందాలని యత్నిస్తోంది. నామమాత్రు
డైన యీనాటిబ్రాహ్మణుడు తన పూర్వప్రతిభ నంతనీ
కోల్పోయి, తన దృష్టిలో ఛండాలుడుగా పరిగణింప
బడే వానికన్న అతిహీనమైన స్థితిలోకి దిగిపోయినాడు.
అందుకనే, ఆర్యబ్రాహ్మణ మతాన్ని అవతలపెట్టి, క్రొం
గ్రొత్త బ్రాహ్మణ మతస్థాపన చెయ్యాల్సిన అవసరం
ఉంది.

అద్వైతమత ప్రచారం ద్వారా శ్రీ శంకరాచార్యుల
వారూ, తిరుమంత్రోపదేశంవల్ల శ్రీ రామానుజుల
వారూ కూడా, తమకున్న అవకాశాలనే ఉపయోగించు
కుని, వర్ణ మత కుల భేదాలు లెక్క చెయ్యకుండా, అందరికీ
బ్రాహ్మణమతం యిప్పించారు; కాని, అది యీ నాటి
కూడా స్థిమితం పొందలేదు. అందుకనే యీ క్రొత్త
ఉద్యమం.”

సర్వమత సామరస్యం తేవటానికై గోపాలకృష్ణుడు

ప్రియత్నిస్తూ ఉన్న సందర్భంలో ఓసారి, యీ క్రింది అంతర్నాటకం జరిగింది. గోపాలకృష్ణుడు ప్రతిభావంతుడని అందరూ అంగీకరిస్తారు. అతని వాగ్ధాటికి అడ్డు నిలవటానికి యెవరూ సాహసించరు. అతని చమత్కార సంభాషణలో కూడా గంభీరభావాలుంటై అని ఒప్పుకుంటారు. కాని...ఓ నాడిలా జరిగింది —రామదండును గురించీ, రామనగర ప్రాశస్త్యాన్ని గురించీ ఆనాటి ఉపన్యాసం.

"రాములవారు మన ఆంధ్రుడని చెప్పటానికనేక కారణాలున్నై. అతడు చాలా కాలం—పదమూడేళ్ళకు పైగా—ఆంధ్రదేశంలోనే ఉన్నాడు. పాశ్చాత్యశాస్త్ర ప్రకారం ఆలోచించినా, అతడు ఆంధ్రుడే అని వాదించటానికి అది ఆధార మౌతుంది. అదీకాక, శరీరంతో కనిపించకపోయినా రామచంద్రుని ఆత్మ యీనాటికూడా గోదావరి ఒడ్డున భద్రాద్రిలో ఉంది. పృథ్వీపతిలో

ద్దై వాంశ ఉన్నదని చాలేమన ఆచార ప్రకారం చూసి నా, అక్కడి నాయకుడు రామచంద్రుడే కనుక, ఆంధ్ర సార్వభౌముడు కూడా అతడే ఔతాడు. కాబట్టి, ఆంధ్ర రాష్ట్రజాతీయ మహాసభాధ్యక్షుడు శ్రీరాముడే, అనటం అతిశయోక్తి కాదు. రామచంద్రుడే అధ్యక్షుడైనాడు కాబట్టి, రామదండు మాత్రమే మనకు స్వరాజ్యం తేగల సంస్థ ఔతుంది.”

ఈ మాటవిన్న ఓ జిజ్ఞాసాపరుడీ ఘట్టంలో తన సందేహాన్నిలా మనవిచేసుకున్నాడు.

“ఆంధ్రరాష్ట్రకాంగ్రెస్ సంఘాధిపతి రామచంద్రుడేఐతే, హింసనుపుడన్నమాట కదా! ఈ హైందవ నాయకత్వాన్ని మహమ్మదీయులెలా ఒప్పుకుంటారు” అని.

ఉంకో నాయకుడైతే ఈ అప్రశ్నకి కలవరపడి సిలువునా నీరైపోయేవాడు. ఇక్కడ, గోపాలకృష్ణుని సమర్ధన చూస్తే బహుఆశ్చర్యం వేస్తుంది.

“నేను చెప్పిందంతా నిజమే. ఎల్లాగా అనేసం దేహాంబస్సు. చూడండి...! మహమ్మదీయులు చంద్రుని పూజిస్తారు. వారిగుర్తు అర్ధచంద్రుడు. అదే చిహ్నం త్రిమూర్తులలో ఒకడైన (విష్ణువే ఇన) శంకరుని తలమీద కూడా ఉంటుంది. కాబట్టి, అర్ధచంద్రుని పూజించే మహమ్మదీయులందరూ శంకరుని పూజిస్తున్నారనే తేల్తుంది. పైగా, శంకరుడు దేవుడు: విష్ణుమూర్తి అవతారమైన శ్రీరామచంద్రుని అంశగల వాడు. అందువల్ల మహమ్మదీయులందరూ కూడా శైవ మతస్తులే ఔతారు; లేదా శైవమతావలంబకులైనా ఔతారు.’

తరువాత సంభాషణ మరీ చమత్కారంగా నడిచింది. ‘పడమటికనుమల్లో మహమ్మదీయులు తమ మతగురువుని ‘శంకర్ ఖాన్’ అనిపిలుస్తారు. అథర్వణవేదంలో, ఉపనిషత్తుల్లో మహమ్మదీయులకు సంబంధించిన ఓ ప్రకరణం ఉంది. దానికి ‘అల్లా ఉపనిషత్’ అని పేరు. దీని యదార్థం తెలు

సుకోవాలంటే ప్రొఫెసర్ మాక్డొనెల్ గారినే కలుసుకో వాలి; ఇది వారే కనిపెట్టారు. మరోయదార్థం ఉంది. శంకరుడు విధ్వంసకారకుడు; రౌద్రిమూర్తి. మహమ్మదీయులకూడా రౌద్రిరసం ప్రిధానం. ఉంకో చిన్న విషయం ఆలోచించండి. మహమ్మదీయులే శైవమతస్తు లుకాకపోతే అతడు ధరించే గడ్డాన్ని వీళ్లెందుకు ధరిస్తారు? ఈఅడ్డు ప్రిశ్న వేసిన మహానుభావునికి యింకాఅను మానం ఉంటే, యిదొకటీవిచారిస్తే తెలుస్తుంది. హైదరాబాదు నబాబుగారు భద్రాచల రామునికి ట్రిష్టీగావున్నారుగదా! కారణం ఏమంటారు? దీనిమూలంగా ఐనా మనం, మహమ్మదీయ చక్రివర్తికి శ్రీరాముని మీాద అమితభక్తి ఉందనినమ్మాలి. కాబట్టేమహమ్మదీయులందరూకూడా శ్రీరామునిబంట్లే అని చెబుతాను. అందుకనే, అందరూ మా రామదండులోచేరి జాతీయ సంఘానికి దోహద మిస్తారని నమ్ముతున్నాను."

ఈమాటలు వినబడగానే ఎక్కడిజనం అక్కడ కుక్కినపేలల్లే ఐపోయినారు. ఆప్రశ్న వేసినవారి విషయం వేరేచెప్పాలా?

సంస్కృతాంధ్రాంగ్ల భాషల్లో అమోఘమైన ప్రతిభ సంపాదించాడు; గోపాల కృష్ణుడు. పొట్టకూటికని కోరి తెచ్చుకునే బిరుదులు లేకపోయినా, అతడ్ని 'ధీ' కొనాలంటే ఎటువంటి బిరుదు మగళ్లకైనా బెదురుగానే ఉండేది.

సభారంజకత్వంలో అతనిది పెట్టిందిపేరు. భక్తిరస ప్రధానమైన భావాల కతని మనసు పుట్టినిల్లు. వాణి అతని రాణి. సర్వసమత్వం పునాదిగా జీవితసౌధం నిర్మించుకున్న గోపాలకృష్ణయ్యకెంద రెందరో శిష్యులున్నారు. ఒక్కొక్క విషయంలో ఒక్కొకరు అఖండమైనకీర్తిని గడించారు. ఆ వర్ధిష్ణువుల్ని చూసి గురుడు పొంగిపోయేవాడు... అదేకాకపోతే...

"సీ॥ దామెర్ల రాముణ్ణి సీమలో మెచ్చారు
వెంకిపాటలు నింగికెక్కుచుండె
వంగవాసి చటర్జి నింగిలీషుకజిన్ను
మెచ్చిగ్రంథాల్రాసియచ్చువేసె
కవుతరయ్య కుమాళ్ళు ఖండాంతరంబుల
గొప్పగొప్పోళ్ళంచు గోలపుట్టె
అడవిబాపడి పేరు పడలే దదింకాను
పడుతుంది దొరలలో పడినయప్పుడు
........................"

అని, ఆ యువక బృందాన్ని యీ విధంగా మెచ్చుకుని వారి ప్రతిభాప్రకర్షలని చిరస్థాయి చేస్తాడా !

గోపాలకృష్ణుడు, అప్పటికే, ఆంధ్రభాషకి పతనం కలిగిం దని గుర్తించాడు. గుర్తించి విలపించాడు. ఆవిలాపం

తన పితృసమానుడైన శ్రీరామచంద్రుణ్ణి ప్రార్థించటం తో అంతమైంది.

"సీ॥ రామలింగారెడ్డి సీమరాజుల పెరీక్
చేరి నఱ బొందంగ గోరుచుండె
గంధికోమటి నన్ను హిందిచే నెట్టించి
బందిలో బెట్టింప బంపుచుండె
పండితుండను వాడు తిండికై వెండికై
చండాలు కడనైన నుండుచుండె
కోతిమేరుకవిగాళ్ల గతులయోమయములై
నన్ను వీధిని బెట్టనెన్నుచుండె

అకట దిక్కెవ్వరింక నాకవనియందు
అనుచు నేడ్చుచు నున్నది యాంధ్రవాణి;
నీదు కోడలి మానంబు నిలుపుమయ్య...!

...........................

అని విస్మయించుకున్నాడు. భాష, ప్రౌఢంగా వున్నా లేకపోయినా, కావ్యం ద్వారా ప్రకటిత మయే నీతి, మానవలోక కళ్యాణానికి దోహద మియ్యాలెననీ, భవ బంధాలచేత బిగింపబడ్డ ప్రాణులకు మోక్షప్రాప్తి కలి గించేదిగా ఉండాలనీ, చెప్పే ఒక ముక్క ఐనా శాశ్వ తత్వం సంపాదించేది కావాలనీ గోపాలకృష్ణుని అభిప్రా యంగా కనిపిస్తుంది. ఈనాటి సత్కవు లెవరూకూడా యీ అభిప్రాయాన్ని కాదనలేరు. శృంగారం అనే పేరు పెట్టి, స్త్రీపురుష సంబంధాన్ని నగ్నంగా చిత్రిం చటం గోపాలకృష్ణునికి ఈషణ్మాత్ర మైనా గిట్టదు. గిట్టదని ఊరు కుంటాడా! ఉహూం... చెప్పి చూస్తాడు; ఆ మార్గంనుంచి తప్పుకోమని. విన్నారా...సరి. లేదా... తిట్టిపోస్తాడు.ఎదుటి కావ్యానికి ప్రాధాన్యం, ప్రచారం లేనప్పటికీ, ఆసందర్భంలో అతడు తిట్టే తిట్లకుమాత్రం అజరామరత్వాలు సిద్ధించి తీరాలి. అలా తిట్టే సమ యంలో, యెదుటి వాళ్ళ మనస్సు నొచ్చుకుంటుందని

గాని, వాళ్ళ కీర్తికి భంగం కలుగుతుందనిగాని అతడు లక్ష్యం చెయ్యడు. ఏవిధంగానైనాసరే, యీ పాప పంకిలమైన లోకంలోంచి తరించేమార్గం పామరులకు చూపించటం అతని ధర్మమని విశ్వసిస్తాడు. కామోద్రేకంతో, కన్నూ మిన్నూ కానకుండా నర్తించే యువకులకు దానిమీద ఏహ్యత పుట్టించటమనేదే అతని ఆశయం. అదే కాకపోతే...ఆధునిక కవుల్లో ఇంచుమించు అగ్రతాంబూలం పుచ్చుకోటానికి అర్హుడైన మెంకిపాటల సుబ్బయ్యగారిని పట్టుకుని......

నీ ' జింక సూపులమెంకి'—

' సిలుకు సీరెల్ కట్టి
ధళుకు పూసల్ బెట్టి
ఉలుకు సూపుల్ సూశి
కులుకు కులికేతల్కి
ఎలికిలా బడ్డారురా — సుబ్బిగా...!'

అని ముఖం యెదుట అనగలుగుతాడా?
సుబ్బయ్యా! జంకులేకుండా...

"యెంకిపిల్లనెచ్చి
సంక కెక్కించావు
సదువు సెప్పించావు
సరసాలు నేర్పేవు
సాకేవు బాగానె గానీ
...... ...........
నాజూకు లేదురా"

అని, యెంతో మోటుగా విప్పి చెప్పగలుగుతాడా? ఎదురు తిరిగితే, ఇంతకంటే యేం ముంచుకొస్తుందో అని కాకపోతే, తమ ఆధారాలు తమకున్నా, ఆ వకీలు సుబ్బయ్యగారు 'కిమ్మ'నకుండా ఊరుకోవలసిందేనా? ఇంతకీ, 'లోకో భిన్నరుచిః' అన్నారు; గోపాలకృష్ణుని అభిరుచి అది...అంతే. 'నేను కవిన'ని చెప్పి, కలం, కాగితం పుచ్చుకుని అతడు కూర్చోలేదు. అతని పలుకు

లన్నీ పద్యాలై, ఉచ్చారణమంతా ఉత్తమసంగీతమై నాకధునిలా ప్రవహించినై. అనేకమైన ఉపన్యాసా లిచ్చాడు, వ్యాసాలు వ్రాశాడు, లేఖలు లిఖించాడు, చతుర్విధ పురుషార్థాలను గురించీ ఉపదేశించాడు... అన్నింట్లోనూకూడా అతని భాషాసౌష్టవం వెల్లడౌతూనే ఉంది. అతని ఆశుధార వ్యక్తమౌతూనే ఉంది.

విజ్ఞానసముపార్జన చెయ్యాలనుకున్న వాళ్ళకి గురుడు తప్పనిసరి అని అతడు భావిస్తాడు. అసాధారణమైన ప్రజ్ఞా, జీవితానుభవమూ కలవాడే గురుపీఠం అధిష్ఠించటానికి అర్హుడని అతని అభిప్రాయం. శిష్యుల భావిజీవిత పథాలను సరిగా నిర్ణయించి, వారిహృదయాల్లో విజ్ఞానచంద్రికలు వెదజల్లేవాడు గురుడొక్కడే కాబట్టి అతడి కంతటి అప్రతిహతమైన శక్తి ఉండాలంటాడు. నేటి విద్యావిధానం అతనికి అసహ్యంవేసింది. అదీకాక, అధ్యాపకులు కెలజీతాలు పుచ్చుకోవటం బహు నీచంగా

తోచింది. శిక్షణకాలం పూర్తికాగానే, శిష్యుడు తనకున్న దాంట్లో, యథాశక్తిగా, గురునికోరిక చెల్లించేందుకుగాను దక్షిణ సమర్పించుకోవటం సవ్యం కాని, ప్రిక్రుతవిధానం మంచిది కాదనిపించింది. యీవిధంగా శ్రిమఫలాన్ని—కొద్ది యెక్కువగానే—పొందే, యీ అధ్యాపకులు కూలీ నాలీ చేసుకుని జీవించే వాళ్ళకంటే యేమాత్రిం కూడా ఉన్నతస్థితిలో లేరని అతనికి తట్టింది. అందుకనే, ఆవిషయాన్ని గూర్చి పలుసార్లు, పలుచోట్ల ఉపన్యాసా లిచ్చాడు. అధ్యాపకు లైనవాళ్ళందరికో విరోధి ఐనాడు.

విద్య నేర్చుకోవటం పూటకూటి కొరకైగానీ, సంఘంలో మెలగడం తెలుసుకునేందుకైగానీ, ప్రివేశ పెట్టబడలేదనీ, ప్రితి జీవినీ ఒక ప్రతిభావంతుణ్ణి చెయ్యటమే దాని తాత్పర్యమనీ చెప్పేవాడు. సంవత్సరానికి వేనకు వేలుగా, బి ఏ., ఎమ్.ఏ లను తయారుచేసే యంత్రా

లుగా కళాలయాలు మారిపోతున్నాయనీ, అర్థంలేకుండా గొఱ్ఱెల మందని తోలినట్లుగా కొన్నివందలమంది విద్యార్థుల్ని ఒకే తరగతిలో కూర్చోబెట్టి, తమకు యిష్టం వచ్చినట్లుగా, తమ వీలు వెంబడి ఏమేమో ఉపన్యసించటం ముందుకాలంలో కావలసిన ప్రజ్ఞావంతుల ఆత్మలకు వినాశం కలిగించటమేననీ ఘంటాపథంగా వక్కాణించేవాడు. సరైన విద్య 'ఆత్మవిద్యయే' అనీ, అది బ్రహ్మోపదేశంతోనే ప్రారంభిస్తుందనీ; సాంగోపాంగంగా చతుర్వేదాలూ గ్రహించి, బ్రహ్మలో లీనం పొందేవరకూ అది అర్థింపవలసినదేననీ ఋజువుచేసేవాడు. ఈ నాటి కొందరు స్త్రీలు చదువుకుని, కట్టుదిట్టాలు లేకుండా చరించటం అతని కెంతో వేదనని కలిగించింది. దాన్ని పురస్కరించుకుని...

సీ॥ "పిక్కకుపాపిళ్లు, నిక్కిన ముక్కోళ్లు,
వాడిపోయిన మోము బీడుకళ్లు,

... ... ...

కాళ్లకు మేజోళ్ళు, కళ్లజోళ్ళు,

ముళ్ళుకట్టిన జుట్టు ముళ్ళుపెట్టిన కట్టు

నక్కిగుట్టిన బట్ట, నడుము తట్ట,

... ... ...

... ... పలకల మెడ

గూని రెక్కలు, చుక్కాసిలేని వాణి

పసిడిపళ్ళును, కుళ్లిన ముసలిపెదవి

... ... ...

... ... ..."

ఇలా ఉంటుంది; చదువుమోపైన చానల చందమని వర్ణించాడు.

1921 జనవరి 21వ తేదీన గోదావరి జిల్లా విద్యార్థుల మహాసభకు రాజమండ్రీలో అధ్యక్షత వహించాడు;

గోపాలకృష్ణుడు. అప్పుడతడు చెప్పినవి నాలుగే ముక్కలు; కాని, అవిచేసినంత పనిని ఏగుంటూరు చాంతాడు మాదిరిఉపన్యాసంకూడా చెయ్యలేదు. విద్యార్థు లందర్నీ ఒకవత్సరం పాటు కళాలయాలు వదిలిపెట్టి, ప్రపంచంలోకి దుమికి, స్వరాజ్యసిద్ధి కోసరం పాటు పడవలసిందని అతని హెచ్చరిక. " ప్రతిమానవునికీ చావు అన్నది ఏనాడో ఓనాడు ఉండనే ఉంది. నీచమైన చావుకంటే, గౌరవనీయమైన చావు నందరూ అభిలషిస్తారు. జీవితం అనే విశ్వవిద్యాలయంలో దైవం ఛాన్సలరుగా వుంటాడు. అందుకని అక్కడచేరి, మోక్షమనే పట్టపరీక్షలో కృతార్థులు కావటం చాలా ఘనమైన విషయం. కాబట్టి, యీ విశాల ప్రపంచంలోకి దూకండి, ఆలస్యంచేయవద్దు " అన్నదే అతని ఉపన్యాస సారాంశం. మర్నాడు అధ్యాపకులు కళాశాలలో కాలు పెట్టేటప్పటికి దుమ్ము పట్టిన బల్లలూ, నిద్రపోయే గదులూ యెదురైనై. తెనాలిలోవున్న 1200మంది విద్యా

ర్థులకీ, గోపాలకృష్ణుని ఉపన్యాసం విన్నమర్నాడు కళాశాలలో కనబడ్డ సంఖ్య 150 మంది అని, తెలిసింది. గోపాలకృష్ణుని విద్యాభిమానాన్నీ, భాషాప్రావీణ్యాన్నీ, ప్రజ్ఞనీ మెచ్చుకున్న మహనీయు లెందరో ఉన్నారు. వాళ్ళందరిలోనూ, తిరుచునాపల్లిలో అఖండ మేధాసం పన్నుడైన పి.టి. శ్రీనివాసయ్యంగారు ఒకడు. ఓ మాటు, గోపాలకృష్ణు డక్కడ ఉపన్యసించటం తటస్థిం చింది. అదివిన్న అయ్యంగార్ గారికి పరవశత్వం కలి గింది. ఉపన్యాసకుడ్ని యెలాబహూకరించాలా అన్నదో ప్రశ్న ఐంది. సరే... యీపని చేద్దాం అనుకున్నాడు; ఏమిటది ? ఆయనకు చేతికఱ్ఱల పిచ్చ చాలాఉంది. చక్కచక్కని చేతికఱ్ఱ లెన్నో తయారు చేయించి దా చుకునేవాడు. రోజురోజూ పొట్టలోకితోస్తే హరిస్తాయ ను కోటానికి అవేమన్నా తినేపదార్థాలా ? కావాయె; మోజున్నొద్దీ పోగుచేస్తాడు. తరిగేవిధం ఏముంది ? అందు కని చక్కని నల్లకఱ్ఱ ఓటి యేరి, నువ్వూ నాఅంత

వాడివే—కొద్దోగొప్పో ఎక్కువే ఐనా— అన్నట్లుగా, దాన్ని—అంతటి సభలోనూ— స్వీకరించాల్సిందని బ్రతిమాలుకున్నాడు. తప్పుతుందీ...? గోపాలకృష్ణుడది గ్రహించాడు. పైగా దాన్ని ప్రాణప్రదంగా రెండేళ్ళ పాటు దాచుకున్నాడు.

'భక్తి' అనేది అనేకసందర్భాల్లో అనేకవిధాలుగా ఉంటుంది. దైవంమీదా, వాక్పతిమీదా, దేశమాతమీదా, మహాత్ములమీదా, అన్ని ఉన్నతమైన అసాధారణమైన శక్తులమీదా భక్తి అనేది ఉంచుకోవటం, అభివృద్ధికోరే వాళ్ల లక్షణం. గోపాలకృష్ణయ్య యీ భక్తి అనే పదార్థంతో చెయ్యబడ్డమూర్తిలా ఉంటాడు.
'రామదండు' గోపాలకృష్ణయ్యచేత సృష్టింపబడ్డ ఆంధ్ర జాతీయసంఘం. మతాభిమానం లేకుండా, ప్రపంచ రక్షణ జరగటం సాధ్యంకాదన్న అభిప్రాయంగల గోపాలకృష్ణుడు స్వరాజ్యసంపాదనకై కష్టింపగల

వానరసేనని యీవిధంగా చేర్చాడు. శ్రీరామచంద్రుని గృహలక్ష్మి ఐన సీతామహాతల్లిని చెరలోంచి విడిపించి, దేశకళ్యాణానికితోడ్పడ్డ వానరమూక మాదిరిగానే, యీ వానరసేనకూడా, పరహస్తంగతమైన భారతమాతకు స్వేచ్ఛాస్వాతంత్ర్యాలు చేకూర్చి, స్వరాజ్య స్థాపన చెయ్యగలదన్న ఆశ అతనికి అధికంగా ఉండేది. రామదండు దేముని సేన అనీ, అదెంతటి అసాధారణమైన కార్యాలనైనా కొనసాగిస్తుందనీ నమ్మేవాడు.

రామదండు ధరించే దుస్తులన్నీ యెఱ్ఱరంగులో ఉండేవి. ఆ రంగునుబట్టి, యిదేదో పాశ్చాత్య సంప్రదాయం లోంచి అనుసరింపబడ్డదని భావించటం పొరబాటు. మానసిక, ఆర్థిక, రాజకీయ విషయాలన్నింట్లోనూ రామదండు—ధర్మమార్గాన్ని తప్పకుండా— సహాయ పడుతుందనీ, అదో కామధేనువువంటిదనీ గోపాలకృష్ణుడు చెప్పేవాడు. రామదండు, సర్వకాలసర్వావస్థల్లో

నూ రామనామం స్మరిస్తూ ఉండాలనీ, సత్కార్యా లన్నింటినీ రామకార్యాలుగా స్వీకరించి తనకుగల సర్వస్వాన్నీ త్యాగంచెయ్యాలనీ నిర్ణయించాడు. తన పనిలో ఉన్న రామదండు సైనికుడు ప్రతివాడూ ఓ యెఱ్ఱరంగు బట్ట కట్టుకుని, యెఱ్ఱని చొక్కా తొడుక్కుని, యెఱ్ఱని తలపాగా చుట్టుకుని, యెఱ్ఱని కుంకుమ బొట్టు నుదుట పెట్టుకోవాలన్నది అతని నిర్ణయం. ప్రతి సైనికుడూ రుద్రాక్షమాలనీ; అంగవస్త్రాన్నీ రాగిచెంబునీ, చేతికఱ్ఱనీ, రెండు చిన్ని చిఱతలనూ పొంది ఉండాలని కూడా విధించాడు. ప్రయాణాలు చేసేటప్పుడు, వంట చేసుకునేందుకు పాత్ర సామానూ, నిప్పులపెట్టే, తినుపదార్థాలూ ఓ సంచిలో కట్టుకుని బయల్దేరాలని యేర్పాట్లు చేశాడు. గురువునే దైవంగా భావించి, అతని ఆజ్ఞలన్నింటినీ 'తూచా' తప్పకుండా శిరసావహించటం, తెల్లవారుఝామున లేచి రామనామ

స్మరణచేసుకుంటూ స్నానంచేసి, అనంతరం నియమింప బడ్డ విధులు మారుమాట లేకుండా, స్వార్థరహితంగా, నిష్కల్మషమైన మనసుతో నిర్వర్తించటం, కుల, మత విభేదాలు లేకుండా అన్నిప్రాణులూ దేవుని ప్రతిబింబాలే అని నమ్మి ప్రేమభావంతో అన్నికార్యాలూ నెరవేర్చటం, దేవాలయాలూ, నదీప్రాంతాలూ, సభలూ దర్శించి, పూజలు చేయటం, వ్యాయామం చేయటం, యివన్నీ దండువిధులుగా నిర్ణయింపబడ్డాయి. ఆంజనేయుని విగ్రహం చిత్రింపబడ్డ పతాకం రామదండు దళానికి చిహ్నం. ప్రతిగ్రామంలోనూ ఒక్కొక్క రామమందిరం ఉంటుంది. అక్కడ, వర్మ అనే నాయకుడూ, శర్మ అనే ప్రధానీ, గుప్త అనే కోశాధికారీ, దాసు అనే సేవకుడూ ఉంటారు. ఉంకో పెద్దని యీ నలుగురూ కలిసి యెన్నుకుని మొత్తం ఐదుగురూ ఓ పంచాయతీ సంఘంగా ఏర్పడుతారు. పంచాయతీ, తాలూకా, జిల్లా, ధర్మసభలన్నికూడా యేడాదికొకసారి యేడు

రోజులపాటు (సప్తాహం) ఒక పవిత్రస్థలంలో కలుసుకుంటై; కలుసుకుని, ఆ సంవత్సరంలో అనుసరింపబడాల్సిన విధానాన్ని నిర్ణయిస్తై. అదంతా రామదండు నుగూర్చి. ఇక యీ రామదండు చేసిన కార్యాలాలో చిద్దాం.

చీరాలగ్రామంలో పురపాలక సంఘాన్ని ప్రభుత్వంవారు ప్రజాభిప్రాయాలకు విరుద్ధంగా నియమించారు. గ్రామ ప్రజకు నాయకుడు గోపాలకృష్ణుడు. మా పల్లెను పల్లెగానే ఉంచండిగాని పట్టణపు పోకిళ్లు తగిలించి మా గ్రామజీవిత సౌభాగ్యాన్నీ, శాంతినీ నాశనంచేయవద్దని ఆ పల్లెజీవుల ఆర్తానాదం. అహింసా వ్రతానికి పూనుకున్న కాంగ్రెసు ఆరోజుల్లో బాగా పనిచేస్తోంది. అప్పుడప్పుడే తలెత్తుతూఉన్న జస్టిస్ పార్టీ పానగల్ రాజావారి ఆధ్వర్యంక్రింద అడుగులు మొదలెట్టింది. నూతన బ్రాహ్మణమత స్థాపకునకూ, ప్రభుత్వాధికారానికి సలాములు

చేసే జస్టిస్‌పార్టీకీ మధ్య ఉన్న పోట్లాటకు ఆ చీరాలా పేరాలా యుద్ధభూములైనై. ప్రజాభిప్రాయానికీ, జాతీయగౌరవానికీ విరుద్ధంగా ప్రవర్తించే ప్రభుత్వాధికారాన్నెదిరించటం గోపాలకృష్ణునికి ముఖ్యకర్తవ్యంగా తోచింది. అందుకుగాను యెంతటి త్యాగం చెయ్యటానికైనా సంసిద్ధులై ఉండేటట్టుగా ప్రజనిఅతడు తర్ఫియతు చేశాడు.

ప్రభుత్వ బలాన్నెదిరించటానికి రెండే మార్గాలు కనబడ్డై. ప్రభుత్వంవిధించే పన్ను లేఖీకూడా చెల్లించ కుండా వుండి, ఆస్తులన్నీ జప్తుచేయబడ్డా, లాఠీ ప్రయోగాలు చెయ్యబడ్డా, ప్రాణాలు బలవంతంగా హరింపబడ్డా, యెంతటి అనుకోరాని అడ్డరాని కష్టనష్టాలు యెదిరించినా లెక్క-చెయ్యకుండా ఉండటం ఒకటి; గ్రామమంతా నిర్మానుష్యంచేసి, తమకున్న విలువగల ఆస్తిని మాత్రం వెంటవుంచుకుని, యిళ్లూవాకిళ్లూ ఒదిలిపెట్టి

దూరంగా ఉండటం రెండోది. గోపాలకృష్ణుని అభిప్రాయప్రకారం మొదటిపని బాగుంది. కాని, గాంధీజీ ఆ రోజుల్లో అక్కడికి వెళ్లి, పరిస్థితులన్నీ విచారించి నిర్ణయించింది రెండోవిధంగా ఉంది. కాబట్టి, గ్రామమంతా ఖాళీ చెయ్యటమే మంచిదని నిశ్చయించాడు; గోపాలకృష్ణుడు.

15, 16, వేల మంది ప్రజలు, స్త్రీ, పురుష, బాల, వృద్ధులు అందరూ, రాబోయే కష్టాలను యెరిగిఉండికూడా పట్టెటూరి పొలిమేరలు దాటి వెళ్ళారు. గోపాలకృష్ణుని రామదండుకి చేతినిండా పనిదొరికింది. ఊళ్ళోంచి ప్రజను వారి సంపదలతో సహా తరలించటం, ఊరి చివర వాళ్ళకు కావల్సిన యిళ్ళు—డేరాలు—నిర్మించటం, అవసరమైన వసతులన్నీ యేర్పాట్లు చెయ్యటం యీ ముఖ్యమైన సేవ చేసింది; రామదండు. పానగల్లువారి ప్రగల్భాలేమాత్రంకూడా పనిచెయ్యలేదు. చీరాల గ్రామం ఓ యెడారిలా తయారైంది.

ఏమన్నా చెబుదామని వచ్చిన అధికార్లందరూ విసే వాళ్ళులేక ఇంటిదారి పట్టారు. చూసిపోదామని వచ్చిన పెద్దలు, తాగే నీరు దొరక్క తహతహలాడారు.

గోపాలకృష్ణుడు మయుడు కాకపోయినా చీరాలకు చేరువలో మరో చక్కనిగ్రామం సృష్టించాడు. డబ్బు సంచులమూతులు విప్పకపోయినా ప్రజా నాయకుడుగా పరిగణింపబడ్డాడు. కట్టేది కావిపంచె ఐనా, తలపాగా తప్ప కిరీటంలేకపోయినా, శ్రీరామచంద్రుని ఆజ్ఞప్రకారం రామరాజ్యాన్ని నిర్మించి రాజాధిరాజైనాడు.
పదకొండుమాసాలు ఆ పోరాటం జరిగింది. అధికారుల అహంకారాన్ని అరికట్టగల శక్తి ప్రజలో విజృంభించింది. గోపాలకృష్ణుడు చివరిదాకా లేకపోయినా, పోరాటం బహు విజయవంతంగా సాగి, ప్రజాభిప్రాయాన్ని నిలబెట్టింది.

స్వరాజ్యంకావాలని గోలచేసే ప్రజకి, గోపాలకృష్ణుడు చక్కనిపాఠం నేర్పాడు. చీరాల పేరాల పోరాటాలు అర్థంచేసుకున్న అందరికీ, స్వరాజ్యంసంపాదించటమంటే యెంతకష్టతరమైన పనో తెలుస్తుంది. స్వరాజ్యం మనకు మనం సంపాదించుకుని అనుభవించాల్సిందే కాని పరాయివాళ్లు దయతో యిచ్చేదీ, మనం కృతజ్ఞతతో పుచ్చుకునేదీ కాదని రుజువౌతుంది.

గాంధిజీ ఖద్దరు కట్టుకుంటేనే స్వరాజ్యం వస్తుందంటాడు. గోపాలకృష్ణయ్య, ఖద్దరు కట్టితేనే ఒస్తుందనటం తప్పనీ, స్వరాజ్యసంపాదనకు ఖద్దరుధారణంకూడా ముఖ్యమనీ చెప్పామంటాడు. ఖద్దరు ఉద్యమం బుజ్జగిస్తూ బొజ్జకూ యెక్కువపని కల్పించనిది కాబట్టే, మన నాయకులందరూ దాన్ని పెద్దగాచేసి ప్రచారం సాగిస్తున్నారనీ, కులాలన్నింటినీ కట్టే ఓ సదభిప్రాయపాశం ఉండకపోతే ఏదీ సాగదనీ అతడు ఘోషిస్తాడు. స్వపరిపాలన

చేతనైతేనే కాని, పరిభుత్వానికి ధీమాగా మనకోర్కెలు తెల్పడం ఉచితం కాదనీ, దానికై మనం పరిథమంలో అన్ని కులాలకూ, మతాలకూ, మధ్య సంఘీభావాన్ని నెలకొల్పాలనీ అతని వాదన. చీరాలలో పంచాయితీ సంఘాన్ని పెట్టినప్పుడు, అక్కడ ఉండే 30 కులాల వారికీ గోపాల కృష్ణయ్య పాత్రినిధ్యాన్ని చ్చాడు. అందుకనే అది సర్వంగా ఒకే ఒకగొంతుతో మాట్లాడి, కార్యసాధనకు ముందడుగువేసి కోర్కెలీడేర్చుకుంది. మనలోయెన్నికక్షలున్నా మనలో మనమే తీర్చుకోవాలి గాని, పరాయి వాడితీర్పుకై మోకరించటం బుద్ధిహీన బాటని పదేపదే చెప్పాడు.

1920 చివరిభాగంలో కొత్తరూపంపొందిన శాసనసభకు యెన్నికలుజరిగినై. ఊరుపట్టనంత పేరుసంపాదించిన శ్రీ. జె. కుప్పుస్వామిచౌదరీగారు ప్రభుత్వబలంతో అభ్యర్థిగానిలబడ్డారు. గోపాలకృష్ణుడంతవరకూ శ్రమిం

చిచేకూర్చిన సంఘీభావం అక్కడపరిత్యక్తమైంది. ఓట్ల పెట్టెలు నిర్ణయించుకున్నారు. కుప్పుస్వామిగారికి చెప్పు ల్లో కాళ్ళు నిలవటంలేదు. ఎంతో పట్టుదలతో యాచనా పద్ధతి కుపక్రమించారు. డబ్బు సంచులు కూడా చాలా వరకు ఓటర్లయిళ్ళు చేరేఉంటై. మధ్యవర్తుల ముఖాలు కలకల్లాడుతున్నై. మనమే గెలవకపోతే మరేముందని కుప్పుస్వామిగారు చెప్పుకుంటున్నారు......అంతట్లో లెక్కలు తేలినై. నిజాయితీగల భటులనిపించుకున్న స్వామిగారి గుమాస్తాలిద్దరూ— ఊరంతా కట్టుకట్టి తమ ఓట్లన్నీ ప్రతికక్షుల పెట్టెలో వుంచినా—మాటతప్పకుండా, ఉప్పుతిని ఊరుకోకుండా తమ రెండువోట్లనీ తమస్వామి గారికే అర్పించుకున్నారని తేలింది. ఆ వోట్లు వాళ్లవి కా వేమో అనుకోటానికూడా వీలులేకుండా, మూడో ఓట న్నదే కనిపించలేదుట. చూడండి; జాతీయాభిమానం మతాభిమానంతో మిళితమై సంఘీభావంతో పనిచేస్తే యెంతటివిచిత్రాలు జరుగుతయ్యో!

"ఖద్దరుద్యమం గృహపరిశ్రమలకు దోహద మిస్తుంది. యంత్రాల మూలంగా పని చెయ్యటం మానుషత్వాన్ని చంపుకోవటం ఔతుంది. ఒక యంత్రం పనిచేస్తోందంటే, కొన్ని వేలకడుపులు మాడుతున్నై అని తెలుసుకోవాలి. ధనికవర్గాన్ని వృద్ధిచేసి, వారిపశుబలాన్ని యినుమడించి పేదల కుత్తుకలు కోసేదే యీ యంత్రం; అందుకని, స్త్రీ పురుషు లందరూ, యెవరి యింటికి కావలసిన గుడ్డని వాళ్లు స్వయంగా తయారుచేసుకోవాలి; కూలీడబ్బులు తిని బ్రతకడం బహు నీచం." అని ఖద్దరుద్యమాన్ని గూర్చి మెచ్చుకుంటూనే మాట్లాడుతాడు; గోపాల కృష్ణుడు. కాని, అస్పృశ్యతా నివారణం అంతకంటె అవసరమని ఉద్ఘాటిస్తాడు.

అస్పృశ్యత అంటే తాకకూడనిది అనే ఐనా, అది మన అగ్రజాతుల బుఱ్ఱల్లో పడి బహు విపరీతమైన అర్థా లూ, పాఠాంతరాలూ పొందింది. అధమజాతి వాళ్ళ

నందర్నీ వెళ్ళి ముట్టుకురమ్మని యెవ్వరూ చెప్పలేదు. కాని, వాళ్ళని చూస్తే నే స్నానం చెయ్యాలనీ, వాళ్ళ మాట వినపడి తేనే దైవం కుళ్ళి కుమిలి పోతాడనీ, పైగా, దైవానికి ట్రిస్టీల మనుకునే బ్రాహ్మణుల మీాద పడి విరుచుకు తింటాడనీ, వాళ్ళ వాసన తగిలి తేనే—కుక్కలమాదిరి గ్రిహిస్తారు కాబోలు—మైలపడి పోతారనీ, మొదలైన ముగ్గిపోయిన భావాలు పెంచుకున్న అగ్రిజాతులు, దాన్ని రాల్చేస్తేనేగాని జాతీయాభ్యుదయం కలగదని అతని దృఢాభిప్రాయం. అందుకనే, తన ఆశయాలూ అభిప్రాయాలూ నెరవేర్చుకోటానికి తగినట్టుగా రామదండును ధృఢపరచుకున్నాడు.

అఖిలభారతజాతీయసంఘం మార్చి 28 వ తేదీన (28–3–1921) సమావేశమైంది; బెజవాడలో. గోపాలకృష్ణుడు, 1,000 మంది అనుచరులతో అక్కడకు చేరు

కున్నాడు. ఎలా వచ్చాడా అని సందేహం దేనికి! తనే మో శంకరుడాయె; అనుచరులు వానర సైన్యమైరి; ...కొదవయేముంది.? ఓ రైలుకి రైలూ స్వయంగా పాట బాడేశాడు. మహారాజభోగంతో, తన స్వంతబండీలో దిగాడు. అప్పటికే రెండు మూడు లక్షలమంది జనం బాపూజీ దర్శనం కోసరం మూగి ఉన్నారు. ఆ సమావేశం మూడురోజులపాటు జరిగింది.

గోపాలకృష్ణుడంటే ఓ రాక్షసి అన్న అభిప్రాయాన్ని బాపూజీకి అందజేసిన మహనీయులు కూడా ఆ సమావేశంలో చేరారు. ఎవరిఘనత వాళ్ళు చాటుకుంటున్నారు. హోటళ్ళకుపోయి సాంబారుభాండాలు మెగరేస్తున్నారు. గోపాలకృష్ణుడి కిదంతా ఆశ్చర్యాన్ని కలిగించింది. తన సిబ్బందినిమాత్రం అలా వదిలిపెట్టకూడదనుకుని, ఒక్కొక్క యింటికి ఒక్కొక్క మనిషిని ఒప్పచెప్పి, దమ్మిడీ ఖర్చు చెయ్యకుండా, భోజనాది వసతులన్నీ

సమకూర్చుకున్నాడు. ఆవిధంగానే, అక్కడికొచ్చే జన మందరికీ వసతులుచేసే యేర్పాట్లుచూడటం హైందవ సంప్రదాయాన్ని నిలబెట్టడంగా ఉంటుందని యెన్నో మార్లు అక్కడి ప్రముఖులకు చెప్పిచూశాడు. కాని, అందరూ అతడినో వెఱ్ఱి బిచ్చగాడని తిట్టిపోశారు.

మొదటి రెండురోజులూ కాంగ్రెస్ వాలంటీర్లు యెక్కువగా శ్రమించారు. ఆ వచ్చిన అన్నిలక్షలమందినీ అదుపాజ్ఞల్లో ఉంచి, సభని జయప్రదంగా జరపాలని బహు ప్రయత్నించారు; కాని, వారిశ్రమ వృధా ఐ పోయింది. నిజానికి, షౌకతాలీయే గనుక అక్కడ ఉండి తన ఇనుపచేతుల బోనులో బాపుజీనిపెట్టి కాపాడక పోయి నట్లైతే, ఆ రెండోరోజున యెంతటి ఘోరమన్నా జరిగి ఉండేది. ఆ ఘట్టంచూసి, తమ అశక్తతను గ్రహించుకున్న కాంగ్రెస్ పెద్దల కారోజునగాని, గోపాల కృష్ణుడూ అతని రామదండూ కనిపించారుకారు.

'దాసోహం' అని చేతులు జోడించి, మిగిలిన ఒక రోజూ ఐనా సవ్యంగా జరిగేట్టు చూడాల్సిందని అతణ్ణి ప్రార్థించారు. రామదండుకు సవ్యమైన అదనుచిక్కింది. 'సరే... అదెంతటిభాగ్యం' అని, బయలుదేరాడు. పగాయి వాళ్ళెవరూకూడా ఆరోజున ఊఁ...ఆఁ...అన కూడదనీ, తనుచేస్తున్నపని చూస్తూ ఉండాల్సిందేననీ, అలాఐతేనే తాను కల్పించుకో తలచాననీ చెప్పాడు; గోపాలకృష్ణుడు. కాదంటే జరిగేవిధం కనపడక తల లూపారు, పెద్దలందరూ.

తొలికోడి కూతకే, మైదానంలో సంసిద్ధమైంది; రామ దండు. తమశరీరాలతోనే, వీధులూ, సందులూ, రహదా ర్లూ నిర్మించింది. వచ్చినవాళ్లు కూర్చునేందుకు వీలుగా తరగతులవారీగా స్థల నిర్దేశంచేసింది. తెల్లవారేటప్ప టి కల్లా, తమకు సాయంవచ్చిన మరికొందరు వాలం టీర్లతో కలసి, కావలసిన విధంగా ఏర్పాట్లన్నీ

చేసింది. నాయకులు దర్జాగా, ఠీవితో అడుగులు వేసుకుంటూ వచ్చేటప్పటికి మైదానమంతా పునాదులు లేచిన ఓపట్టణంలా తయారై ఉంది. అలా, ఇటుక రాళ్లకు బదులుగా రామదండు ప్రాణాలని ప్రతిష్టిం దని అందరూ గ్రహించారు. ఇక్కడో చిన్నవింత జరిగింది.

రక్షకభటులంటే మనకోసం పుట్టిన వాళ్ళుకదా! వాళ్ళ కే మనమీద అధికారం చెలాయించే హక్కులేకపో తే మరెవరికి ఉంటుంది! ఆయదార్థాన్ని కూడా రా మదండు గ్రహించలేదానాడు. తన పదవికి తగిన హంగుతో ఓయినస్పెక్టరుగారు జనం మధ్యనుంచి తోసుకుని ముందుకు పోవటం వాళ్ళకు నచ్చింది కా దు. వెంటనే ఆసైనికులు ‘ ఆఁ...ఆగండ ’న్నారు. ‘ నో ’ అన్నాడాయినస్పెక్టరుగారు. ఉంకా యేముం ది; గలభా పెరిగింది. లాఠీల ప్రయోగం జరుగు

తుందేమో చూద్దామని అందరూ అట్టే మూగారు. అంతలో 'ఆగండి...వస్తున్నా' నని ఓగర్జన ధ్వనించింది. జనమంతా అటుచూశారు; కనిపించిందెవరు! ఆ...రక్తాంబర ధారి...గోపాలకృష్ణుడు. మా రామదండుమాట వినక తప్పదంటాడు, గోపాలకృష్ణుడు; మా గౌరవాన్ని క్షేమం కాపాడుకు తీరాలంటాడు: ఆపెద్ద మనిషి. వాదించి లాభం లేదనుకుని, "అయ్యా! మీ ఇష్టంవచ్చినట్లుగా మీ పాదాన్ని కదల్చాలంటే, మొదటికొండ — నా దేహం — అడ్డొస్తోంది, ఇదే విధంగా మాదండులో ఉన్న వెయ్యి కొండలూ మీకు ఎదురౌతై. కానీయండి ... ముందర యీ మొదటి మెట్టెక్కండి..." అని, నిలువునా, ఆయన కడ్డంగా సాష్టాంగపడ్డాడు, గోపాల కృష్ణుడు. ఇదంతాచూస్తున్న బాపూజీ కళ్ళల్లో ఓనూత్న కాంతి వెల్లివిరిసింది. మరుక్షణంలో, ఆ ఇనస్పెక్టరుగారికి సరైన దారీ కనిపించింది, రామదండుకు మధ్యగా జయజయ

ధ్వానాలు ఆకాశాన్ని అంటుకుంటుంటే, గోపాలకృష్ణ య్య ముఖంలో ఓ బ్రహ్మాండమైన వెలుగు మెఱవ నూ మెఱిసింది.

అప్పైన వారంలోగా, ది. 7-4-1921 న గాంధిజీ స్వయం గాచీరాలకు వెళ్ళి, రామనగరానికి పునాది వేసి వచ్చాడని గ్రహించటం కూడా యీ సందర్భంలో 'ముఖ్యమే ఔ తుంది. ఈ విధంగా, రామదండు నెరవేర్చిన కార్యా లెన్నో ఉన్నై. అందులో మరపురాని మరో విచిత్ర విషయం గుర్తుకు వస్తోంది.

వేటపాలెంలో ప్రభుత్వం, పంచాయితీబోర్డు నోదాన్ని నెలకొల్పాలని యత్నించింది. మామూలు పద్ధతిలో ప్రజ 'ఆదిమాకు వద్దు' అని, మొఱ పెట్టుకున్నారు. అది గోపాలకృష్ణయ్య చెవులో పడ్డది. అంతే... వెంటనే ఆ వూరు వెళ్లి, అక్కడఉండే 30మంది కులపెద్దల్ని పిలిచి, నామాట వినేటట్టయితే మీ ఆశయం సిద్ధిస్తుందని

చెప్పి, అలా నేప్రమాణాలు చేయించుకుని, ఆ ఎన్నికల రోజున మెవ్వరూకూడా ఆఊళ్ళో ఉండకుండా యేర్పాట్లు చేయించాడు. ఒకటి, రెండు, మూడురోజులు గడిచిన్నై. గోపాల కృష్ణుడేదో పనిమీద చీరాలలో ఉన్నాడు. అదేసమయం అనుకుని, తహశ్లీదారుగారు తమశిబ్బంది తో తయారై, పెద్దలందరికీ తాఖీదులు పంపారు. ఏడ్చిన యేడ్పు లేమైనయ్యా, చేసిన ప్రమాణా లేమైనయ్యా ఆ ముప్పైమంది పెద్దలూ తమతమ బలగాలనేసుకుని హాజరైనారు. మెత్త మెత్తగా వాళ్ళనందరినీ ఒంచి, పంచాయితీ సంఘాలవల్ల ప్రజకు కలిగే ఉపకారాలు చెబుతూ, ప్రజ యెలా నడుచుకోవాలో బోధించటం ప్రారంభించారు. ఆసమయంలో దిగాడు; గోపాల కృష్ణుడు దూరంగానిలబడి, అదంతా చూస్తున్నాడు. తహశిల్ దారుగారి గుండెల్లో దడపుట్టింది. పెద్దలంద రూ ఒకరి మొగం ఒకరు చూచుకోసాగారు. అది గ్రహించుకున్న తహశిల్దార్ గారు గోపాలకృష్ణయ్య

దగ్గిరికి వెళ్ళి, తాను ఓ బంటులాగా పని చేస్తున్నట్లూ, తన విధ్యుక్తధర్మాన్ని తను నెరవేర్చుకునే సందర్భంలో అతని (గోపాలకృష్ణుని) దర్శనమే అక్కడ అపాయకరమైనట్లూ విన్నవించుకుని, కావలసివస్తే, తన బంగళాలో ఆయనకు వసతి యిస్తాననికూడా చెప్పాడు. ఓ చిరునవ్వు విసిరేసి, గోపాలకృష్ణుడు ఆ స్థలం వదిలి, దగ్గిరలోనే ఉన్న ఓ కొబ్బరితోపులో చేరి, నిలువునా నిలబడి తలలూపే వాటినిపృచ్ఛిస్తూ ఓ గంభీరోపన్యాసం యిలా కావించాడు. "కల్లాకపటం తెలియని మీరుమాత్రమే నాకు తగినవాళ్ళు. అర్థంలేకుండా ప్రమాణాలుచేసి తప్పించుకోవటం, హానిసత్వానికే పుట్టామని నిశ్చయించుకుని తమ ఆత్మలకు వినాశం కలిగించుకోవటం మీకు తెలియవు. మనిషి, మీకంటే యెందులోనూ కూడా యెక్కువ కాదు. అతనికంటే మీరు ఉన్నతమైన స్థితిలో ఉన్నారు. మిమ్మల్ని సాధారణంగా భయపెట్టగల శక్తి ప్రపంచంలో లేదు. కల్లబొల్లి మాటలు

విని మీరు పొంగిపోరు. లోకాలు మీదపడతయ్యే మోనని మీరు జంకిపోరు. మీ చూపంతా ఎప్పుడూ ఊర్ధ్వలోకంవైపే ఉంటుంది. మనుష్యులమాదిరిగా పాతాళానికి పోయే దుర్మార్గపు పనులేవీ మీరు ఆచరించరు. మీరు మంచిగా ప్రవర్తిస్తారు; మంచి ఫలాన్ని పొందుతారు..."

ఇది అక్కడకూర్చున్న అందరి చెవుల్లోనూ పడ్డది. స్వేచ్ఛ కోరే బడిపిల్లలమాదిరిగా, ఏదో ఒకవంక పెట్టుకుని నెమ్మదిగా 5,10,15 చొప్పున జనమంతా తోపుచేర మొదలు పెట్టారు. ఒక అరగంట ఆవిధంగా ఉపన్యాసం సాగేటప్పటికి కొబ్బరి తోపంతా యిసుకవేస్తే రాలకుండా అయిపోయింది. ఆ ఉపన్యాసం పోయి పోయి, సాయింత్రం 6 గంటలైందనికూడా లెక్కచెయ్యకుండా, హాయిగా సాగుతూనేఉంది. ఆముప్పదిమంది పెద్దలూ, తహశీల్దారుగారూ వేచి చూశారు. కాని,

ఎన్నికల ఆఫీసు దగ్గరకొక్క మనిషీ వెళ్ళేట్టు కనిపించ లేదు. ఎలా వెడతారు? గోపాలకృష్ణుని ఉపన్యాసంమర్థ్యంలో లేవగల శక్తి యెవరికుంది.? దీపాలు పెట్టింతరువాత తహశీల్ దారుగారు బంగళాకు వెళ్ళి, తమ డైరీలో వ్రాసుకుని ఉంటారు...'శ్రమంతా వ్యర్థమైంది' అని. భోజనాల వేళకు గోపాలకృష్ణుడూ, అతని సైనికులూ, వేటపాలెం ప్రజా, యిళ్ళకు చేరుకున్నారు. ఈవిషయాలన్నీ గ్రహించిన గుంటూరు జిల్లా సంఘంవారు 1921 జూన్ 10 వ తేదీన పేరాలలో కలుసుకుని, ఆనాయకాగ్రణికి 'ఆంధ్రరత్నం' అన్న బిరుదును ప్రసాదించారు.

గోపాలకృష్ణుడు తన రామదండును కాంగ్రెస్ జాతీయ సంఘంగా అంగీకరిస్తుందేమోనని యెన్నో ప్రయత్నాలు చేశాడు; కాని, ఫలందక్కిందికాదు. 1924 అక్టోబరులో ఆంధ్రరాష్ట్రీయ సంఘం మద్రాసులో సమా

వేశమై, గామదండును అభిమానిస్తూ తీర్మానాలుచేసింది. అంతే. వాడరేవు ప్రాంతంలో నవ విద్యాలయాన్ని నెలకొల్పాలనుకున్నాడు; అదీఅంతమాత్రంగానే సిద్ధించింది. ఒంగోలు డివిజనల్ మ్యాజిస్ట్రేట్ గారిని దర్శించి, కొద్ది స్థలం యిమ్మని అడిగాడు. ఏ ఆలోచన చేస్తున్న సమయంలో కలంపడిచిందో గాని, గోపాలకృష్ణుని కోరికకు తగినట్టుగానే జరిగింది. 58 ఎకరాల భూమిని ప్రభుత్వం మంజూరు చేసింది; కాని, దాని ఆనందాన్ని పొందే భాగ్యం అతనికి దక్కింది కాదు. ఆ భూమి మంజూరైన మూడోనాడే గాబోలు, బెజవాడలో బాపూజీ ఉపన్యాసాన్ని ఆంధ్రీకరించాల్సిన అవసరం కలిగిందతనికి. అంతే, అదక్కడ జరిగిందో లేదో, ఓ తాఖీదు ప్రభుత్వపు ముద్రతో అతనికి అందింది. అందులో 'నువ్వు ప్రభుత్వాభిప్రాయాన్ని పొందకుండా ఆ స్థలంలో అడుగుబెట్టగూడదు' అని. పంచేస్తాడు; విధి బలీయ మైందాయె. తిరిగి పేరాల పెద్దలనగ్గిర ప్రాధేయపడి, యేలాగైతే నేం

18 యెకరాల భూమిని సంపాదించి, శ్రీమదాంధ్రవిద్యాపీఠగోష్ఠి అనేదాన్ని 1920, జూన్ 22 వ తేదీన స్థాపించాడు. 1925 వరకూగూడా గోష్ఠినామకః ఉందేగాని చేసిన పనిమాత్రం కనపడదు.

చేతినిండా డబ్బున్నవాళ్లూ, కళ్లుమీాది కెక్కిన వాళ్లూ గోష్ఠిలో సభ్యులుగా చేర్పబడరని గోపాలకృష్ణుడు ప్రథమంలోనే నొక్కి చెప్పాడు. విద్యాపీఠం శిక్ష్య విద్యాలయమనీ, అందులో హైందవ సంప్రదాయానుసారంగా పిల్లలకు విద్యనేర్ప బడుతుందనీ, ఆ విద్యాపీఠానికి సంబంధించిన విద్యాలయాలు ప్రతి పట్టణంలోనూ, పల్లెలోనూ, ఉంటాయనీ, కొన్ని పత్రికలూ, గ్రంథాలూ గోష్ఠి అప్పుడప్పుడు ప్రచురిస్తూ ఉంటుందనీ, ఆ విధంగా, దేశంలో ఒక నూతన మతస్థాపన జరుగుతుందనీ గోపాలకృష్ణుడు ఆశించాడు; కాని, దానికన్నీ అవాంతరాలై అడ్డువచ్చినై. జాతీయాభ్యుదయానికి అతడు

వేసిన పునాది మొదట్లోనే కుప్పింగిపోయింది. అదంతా మన తెలుగువాళ్ళ దురదృష్టమే ననిపిస్తుంది.

1923 మే నెలలో, శ్రీమదాంధ్రసోదరసమితి అని ఒసంస్థ నిస్థాపించాడు. కాని, దాని ద్వారాకూడా అత నేమీ చేయలేక పోయినాడు. దానికి కావాలనుకున్న 2,50,000 రూపాయిలూ అతడు పోగు చేసే వాడేనేమో కాని, అంతలో; అఖిలభారత జాతీయసంఘం నాగపూరులో సమావేశం కావటం, అప్పు, డక్కడే ఉన్న గోపాలకృష్ణయ్యని కార్యదర్శిగా యెన్నుకోవటం జరగటంచేత ఆపని సాగింది కాదు. 1927 వరకూ కొన ఊపిరితో ఉన్న ఆసంఘం, ఆసంవత్సరమే సాంతంగా పని మానుకోవాల్సి వచ్చిందంటే ఆ గోపాలకృష్ణుని చుట్టుకున్న కార్యదర్శి పదవే కారణం అనుకోవాల్సివస్తుంది. ఏదేమైనా, కాంగ్రెస్‌కు దూరంగా ఉండి అతడు చేద్దామనుకున్నంత సేవా,

ఆంధ్రలో దానికి దక్కిందికాదు. అది ఏనాటికైనా తీరని కొరత గానే ఉంటుంది.

దుఃఖసముద్రంలో మునిగి ఉండికూడా సంతోషాన్ని, బానిస తనంతో మగ్గిపోతూకూడా స్వాతంత్ర్యాన్ని అనుభవించగలవాళ్ళు అరుదుగా కనిపిస్తారు. గోపాలకృష్ణయ్య ఆకొద్దిమందిలోనూ ఒకడు. ఇరవైయేడో యేటనే మద్రాసు ఎడ్యుకేషనల్ సర్వీసులో చేరినగోపాలకృష్ణయ్యకు ఆపదవికి తగినహుందా తనం తక్కువైపోయిందని చాలామంది అనుకుంటారు. కాని, అది, సరిగా అర్థంచేసుకోకుండా పొందే అభిప్రాయం ఔతుంది.

రాజమండ్రి ఆర్ట్సుకాలేజీలో అతడు ప్రొఫెసర్ గా ఉన్న రోజులన్నీ కూడా, దినదిన గండంగానే జరిగిపోయినై. అక్కడ ప్రిన్సిపాలుగారు 'మిష్టర్ రాస్' అనే ఓ దొర

గారు. ఆయనకూడా మంచి ప్రతిభావంతుడే, ఐనా, అప్పటికి ఉద్యోగంలో ఉన్న అందరిలోకీ పిన్నవాడైన గోపాలకృష్ణయ్య తన సహజవాగ్ధోరణివల్లా, ప్రతిభవల్లా ఆ దొరగారి యశశ్రీని హరించేశాడు. ఏ లోకంలో ఐనాసరే, పేరు ప్రతిష్టలూ, అధికారాలూ, పదవులూ, ధనాగారాలూ శ్వేతజాతులవే అని తెలుసుకోకుండా మన నల్లమొగాలు ఆశించటం నాగరికులెవరైనా ఒప్పుకుంటారా? రిటైర్ కాబోయేస్థితిలో ఉన్న రాస్ దొరగారు తమ జీవితాన్నంతనీ ధారవోసి సంపాదించుకున్నకీర్తికాంతని ఒక్కచూపులో, అడుగుపెట్టిన మరుక్షణంలో బానిసగా స్వీకరించిన గోపాలకృష్ణయ్యలో ఉన్న ఆకర్షణశక్తిని యేపెద్దలైనా సమర్థిస్తారా? అదంతా అతడి చిలిపితనం అన్నదిమాత్రం స్థిరపరుస్తారు. అంతే.

పిల్లలతో ఖులాసాగా ప్రొఫెసర్లు తిరగటం ప్రిన్సిపాల్ గార్లకు గిట్టదు. తమ్ము వదలి తమక్రింద ఉండాల్సిన ప్రొఫెసర్లని మెచ్చుకుని అభిమానించటంకూడా పెద్ద లైన ప్రిన్సిపాల్ గార్లకలాగే ఉంటుంది. గోపాల కృష్ణయ్య అసలే స్వేచ్ఛాజీవి. అందులోనూ అతన్ని అభిమానించింది పిల్లకారు. సరే... అల్లరికి లోటు ఉంటుందా...? మెట్ కాఫ్ హాస్టలు సాంవత్సరీకోత్స వానికి ఆ పిల్లలందరూ యేకగ్రీవంగా గోపాలకృష్ణ య్యనే తమ అధ్యక్షునిగా యెన్నుకున్నారు. అంటే... రాస్ దొరగార్ని "తోసిరాజ"న్నారన్నమాట. తన యిష్టంవచ్చినట్లుగా ఉపన్యాసాన్ని ఆశువుగాదంచేశాడు గోపాలకృష్ణుడు. పైగా ఓ జాతీయపతాకాన్ని— ఓ కుఱ్ఱవాడు అందిస్తే— బల్లమీాద ప్రతిష్టించాడు.

అనో పెద్ద కారణమై, రావ్ గారి ఆగ్రహాన్ని, మనిషికి, అందులోనూ నాగరిక జాతికి సహజంగా లోపలవుండే ఉడుకు మోతుతనాన్ని ఉద్రేకించింది. మర్నాడే, ఓ తాఖీదు వారి సంతకంతో తయారైంది. అందులో... "నువ్వు ప్రతిరోజూ కాలేజీకి ఆలశ్యంగా వస్తున్నావు. ఉదయం 9-45 గంటల లగాయతు 12-30 వరకూ, తిరిగి 2 గంటల మొదలు 4-30 గంటల వరకూ నీవు కాలేజీలోనే ఉండాలి. అదీకాక పిల్లలతో చనువుగా తిరగటం మూలాన మా గౌరవం కొంచెమైపోతోంది. అది నువ్వు దిద్దుకోవాలి. అన్నిటినీమించి నువ్వు మొన్న సంవత్సరోత్సవంనాడు చేసిన ఉపన్యాసాన్ని సర్కారు వారు కోరారు; కాబట్టి తప్పక దాన్ని వెంటనే హాజరు పరచాలిసింది" అని ఉంది. అసలే పెంకెఘటం గోపాలకృష్ణుడు. దోబూచులకు భూతాలు భయపడ తయ్యా! ఔను, కాదు, అనకుండా తనపనేదో తను

చేసుకోసాగాడతడు. పుండుమీాద కారం రాచినట్లయిందది దొరగారికి. చూశారు. చూశారు. లాభంలేకపోయింది. సరిగా x॥ 9-45 లు కాగానే కాలేజీ తలుపులు మూసెయ్యమని బంట్రోతుకు హుకుం జారీచేశాడాయన. గోపాలకృష్ణుడదంతా గ్రిహిస్తూనే ఉన్నాడు. కాని, తనతప్పును దిద్దుకోవాలన్న అభిప్రాయం యెప్పుడూ కలగలేదు. ఓనాడు యథాప్రికారం ఆలస్యంగానే వచ్చాడు. కాలేజీలోకెలా వస్తాడో చూస్తానని ప్రిన్సిపాల్ గారు బిగింపబడ్డ తలుపుల వంక చూస్తూ నిలబడ్డారు. పిల్లలందరూ, ఇవ్వాళేదో వింత జరిగితీరుతుందని ఆ చుట్టుప్రిక్కల పచార్లుచేస్తున్నారు. అంతలో, ముఖద్వారానికి దగ్గిరగా— గోచీ బిగించి కట్టిన గోపాలకృష్ణయ్య— గోడమీాదికి పాకి, యెక్కి, క్రిందికి దూకటం వాళ్ళందరికీ ఆనందాన్నీ ఆశ్చర్యాన్నీ కలిగించింది. రాస్‌గారు చేసేదిలేక, గదిలో దూరి సర్కారువారి కా జరిగిన వృత్తాంతమంతా

నివేదించుకున్నారు. అది జరిగిన కొద్దిరోజులకే, 1917 లోనే, లార్డు పెంట్లండ్ గారి జి. ఒ. నం. 555 ప్యాసై వచ్చింది. దాన్నిబట్టి ఏ విద్యార్థికూడా జాతీయసభలకు హాజరుకాకూడదని ఆజ్ఞాపింపబడ్డది విద్యార్థిలోకం. ఏదొచ్చినా ముందుగా బందరు చిందులేస్తుంది. అది ఆవూరి లక్షణం. ఆంధ్రదేశంలోని విద్యార్థులందరూ బందరులో కలుసుకుని, ఆ సర్కారువారి ఆజ్ఞకి అసమ్మతిని తెలుపుతూ తీర్మానంచేశారు. సభలో మాట్లాడటానికి హక్కు లేదని తెలుసుకున్న గోపాలకృష్ణుడు ప్రక్క గదిలో నిలబడి, తన అభిప్రాయాల నన్నింటినీ బిగ్గరగా గోడలకూ బల్లలకూ నివేదించుకున్నాడు. ఆకాశవాణి పల్కులా అన్నట్లు, ఆ విద్యార్థులందరూ చెవులిచ్చి వింటూ కూర్చున్నారు. అంటే, ఆనాటి సమావేశం కనపడని ఉపన్యాసకుని గంభీరోపన్యాసంతో అంతమైందన్నమాట. సర్కారువారి చెప్పుచేతల క్రింద ఉండాల్సిన మనజాతి కీ విధమైన ధోరణి

ఏమాత్రం బాగుంది...? అక్కడఉండే సర్కారు ఏజెంట్లద్వారా ఆ వార్త కూడా ప్రభుత్వానికి పంపబడ్డది. అంతే... ఆకాశంలోంచి పిడుగుమాదిరిగా "నీ సేవని యీనాటినుంచీ మేం ఒదులుకుంటున్నాం" అని, ఓ కాగితం ఊడిపడ్డది. విచారం యెవరికి? ఇది తప్పితే నాకు గతిలేదని ఏడ్చేగులామూ గోపాలకృష్ణుడు!

ఈ వార్త ఆంధ్రజాతీయ కళాశాల అధికారవర్గానికి అందింది. వెంటనే "తమ దర్శనాన్ని అభిలషిస్తున్నాం" అనీ, మేమిచ్చే 80 రూపాయలకీ తమరు సంతోషించి మా జాతీయ విద్యాభిమానాన్ని వృద్ధి చెయ్యాలిసిందని కోరుతున్నామనీ ఓ శుభలేఖవచ్చింది, గోపాలకృష్ణునికి. కాదనే తత్వంలేని గోపాలకృష్ణుడది తీసుకుని, వెళ్లి, ఉద్యోగాన్ని స్వీకరించి మరో తొమ్మిది నెలలు, అంటే, తనకూ అధికారవర్గానికీ మాటా మాటా పెరిగి వాళ్లమీద అసహ్యం పూర్తిగా పెరిగేవరకూ ఉండి, తనకు యిస్తామని అందులో

పెద్దలు వాగ్దానంచేసిన "గృహం" యియ్యకపోవడం వల్ల, దానికి రాజీనామా యిచ్చి వచ్చేశాడు.

తను ఉచ్చరించే ప్రతిమాటకీ విలువ ఉందని గ్రహించుకున్న గోపాలకృష్ణుడు తన సభలకు వచ్చి వినే వాళ్లందరినుండీ ఓ పన్ను వసూలుచెయ్యాలని నిశ్చయించుకున్నాడు. "ఏదో వచ్చి వినివెళ్లామ"నుకోకుండా, డబ్బు ఖర్చుపెట్టినబాధతోనైనా తన ఉపన్యాసాలవిలువ మరపురాకుండా ఉంచుకుంటారుకదా అన్నదే అతని అభిప్రాయం. ఆ భావాన్ని చాలామంది ప్రముఖులు పరిహసించారు. కాని, అదిచాలా ఉత్తమమార్గంగానూ, లాభకారిగానూ కనపించింది గోపాలకృష్ణయ్యకి. అలాసంపాదించిన ధనాన్ని అతడు స్వయంగా వాడుకోకుండా, పేదలకూ, అన్నసత్రాలకూ వ్యయంచేశాడు. ఉపన్యాసానికి గోపాలకృష్ణుడు ఉద్యమించాడంటే కనీసం నూటపదార్లన్నా జాగ్రత్తచెయ్యాల్సిన అవసరం

ఆహ్వానసంఘంవారికి కలిగేది. సణగకుండా అన్ని ప్రాంతాలవారూ అలాగే చేసేవారు.

పదిమంది కలిసినచోట దైవం ఉంటాడన్న అభిప్రాయం గోపాలకృష్ణునికి బాగాఉంది. ఏ సభకుపోయినా ఓ దేవాలయానికి వెళ్ళినట్టే అతడు భావించేవాడు. అనేక సార్లు సభాప్రారంభంలో "శ్రీమద్రమారమణగోవిందో హరిః" అని ప్రారంభించి, సభికులయెదుట సాష్టాంగపడి, వారి అనుమతినందిన తరువాత తన ఉపన్యాసాన్ని హరికథారూపంలో సాగించేవాడు. నిజంగా అటువంటి హైందవసంప్రదాయాన్ని నిలబెట్ట ప్రయత్నించిన వారిలో గోపాలకృష్ణుడే ప్రథముడని చెప్పటం అతిశయోక్తికాదనిపిస్తుంది. మతభేదాలున్న సమావేశాని కున్యసించటం యిష్టంలేక, అతడు అక్కడకు చేరిన వాళ్ళందరికీ మహమ్మదీయులకైనాసరే, క్రైస్తవులకైనాసరే కుంకుమబొట్టు పెట్టితీరేవాడు; అది అతని కొక్కనికే చెల్లింది.

1920 శీతాకాలంలో గోపాలకృష్ణుడసహాయోద్యమంలో చేరాడు. పదవులని ఆశించి, అవిలభించింతరువాత ఏమో సేవచేద్దామనుకునే అభిప్రాయం యెవరిలోఉన్నా అది చివరకు నిరాశనే కలిగిస్తుంది. రాచకీయరంగంలో అధికారవర్గంలో చేరకుండా యేమన్నాచెయ్యటానికి అవకాశం ఉంటుందేకాని, అందులోచేరి, ఆ వ్యామోహంలో చిక్కుకున్న తరువాత బయటి ప్రపంచానికి ఉపయోగపడదామనుకోవటం వట్టి కలగా తేల్తుంది. గోపాలకృష్ణుని జీవితశేషం— ఎనిమిదేళ్ళ- రాచకీయరంగంలో ఉక్కిరిబిక్కిరై పోయింది. పదవివెనక పదవి వచ్చి ఆశ్రయించింది. అన్నిటికీ సరైనన్యాయం ఎవరూ చెయ్యలేరు అన్నది గోపాలకృష్ణుడు చివరకు ఋజువుచేశాడు.

బరహంపూరులో ఆంధ్రరాష్ట్రీయసంఘంలో అసహాయోద్యమాన్నిగురించి మాట్లాడి ప్రభుత్వాధికారానికి గురైనాడు. దాంతో నలుగురిలో మాట్లాడరాదని

ఓ హుకుంవచ్చింది. నామీద అదేంపనిచేస్తుందని ధిక్కరించాడు. అందుకు ఫలితంగా, సంవత్సరం విడి ఖైదు విధింపబడ్డది. ఆ శిక్షాకాలం పూర్తిచేసుకుని ది 2-10-1922 న బయటపడ్డాడు. తిరిగి, నవంబరులోనే, ఏలూరులోనూ బెజవాడలోనూ ఘోరమైన రాజద్రోహకరమైన ఉపన్యాసా లిచ్చాడన్న నేరంకింద 9 నెలలు విడిఖైదు విధించి, ఆపై శిక్షా కాలంతోనే అది గడిచేట్టుగా తీర్పు చెప్పారు, ప్రభుత్వం వారు. పోలీసులతన్ని పట్టుకుని తీసుకువెడుతుంటే "పదవే భద్రాద్రికి, పాపిష్టిఘటమా..." అంటూ పాడుతూ, జైలుయాత్రనో తీర్థయాత్రగా మార్చేశాడని కూడా ప్రతీతి. అతడు జైల్లో ఉన్నంత కాలం యింటిదగ్గిర తన్ను పెంచిన ముసలవ్వమీదే ప్రాణం అంతా పెట్టుకున్నాడు. ఓ సారి తన పుస్తకంలో "శ్రీరామచంద్రుడు పిచ్చివాడుకాబట్టి ఓ చాకలివాడ్ని తృప్తిపరచడానికి తన గృహలక్ష్మిని అడవికి పంపాడే

గాని, మా ముసలమ్మని శాంతింపచెయ్యాలని యీ ప్రభుత్వంవారు నన్ను వదిలిపెట్టేటంతటి పిచ్చివాళ్లౌతారా ” అని వ్రాసుకున్నాడు.

జైలునుంచి బైటకు రాగానే, మద్రాసులో సౌందర్య మహల్‌లో, 4-10-1922 న ఉపన్యసించాడు. ఆ రోజుల్లో అతడికి స్వరాజ్య సంపాదనపైన ఉండే అభిప్రాయాన్ని ;

“ నయాచే రిఫారం-నవా స్కీము ఫ్రేమం
న కౌన్సిల్ న తు ప్రీవికౌన్సిల్ వదంవా
స్వరాజ్యార్థి హాస్తాంగ్లరాజ్యేనియన్తా
ఫరంగీ, ఫిరంగీ ద్వృగంగీకరోతు ”

అన్న శ్లోకంద్వారా వ్యక్తపరచాడు.

1924 జనవరిలో గాంధీజీ ఖయిదులోంచి స్వరైన ఆరోగ్యంతో విడుదలైనాడు. ఆ సందర్భంలో “గాంధీపూజానిధి ” అని ఓ లక్షరూపాయిలు వసూలుచెయ్యటానికి

పూనుకున్నాడు, గోపాలకృష్ణుడు. అనేకచోట్ల దీక్షా సంఘాలు నెలకొల్పి, తాను స్వయంగా 8 వేలరూపా యిలు పోగుచేశాడు. ఓ రోజు, గాంధిజీకి ఆరోగ్యాన్ని ప్రసాదించిన దైవప్రార్థనాదినంగా నిర్ణయించి, చీరాలలో కావలసిన యేర్పాట్లన్నీ చేసి, ఆంధ్రరాష్ట్రానికి ముఖ్యస్థానమైన బెజవాడలో యెలా జరుగుతోందో చూద్దామని వెళ్లాడు. గాంధీపార్కు చేరేటప్పటికి అతనికి బహువిచారం కలగింది. ఓ వందమందికిలోపు జనం కూర్చుని, దైవానికి కృతజ్ఞతాపూర్వకమైన వందనా లర్పించి సభను పూర్తిచెయ్యబోతున్నారు. మరో నిముసంలో జనమంతా బైటికి వస్తారు. అది గ్రహించిన గోపాలకృష్ణుడు సరాసరి లోపలికి వెళ్లాడు. అంత వరకూ బైటనిలబడిఉన్న జనమంతా అతణ్ణి అనుస రించారు. వెంటనే గద్దెనెక్కి, సభకు నమస్కరించి, ఆవిధమైన సభవల్ల లాభంలేదని చెప్పి, మర్నాటి సాయంత్రిందాకా ఆ సమావేశాన్ని పొడిగించటానికి

వాళ్ల అనుమతిని అర్థించాడు. కాదనగలవాళ్లెవరు? సరేఅంటే సరే అన్నారు. మర్నాడుదయాన ఓ గాంధీప్రభని కట్టి రెండెడ్ల బండీమీద అలంకరించి, ఉంచి, వీధివీధీ, యిల్లుల్లూ దర్శిస్తూ, భిక్ష అడుగుతూ, హారతు లందుకుంటూ పట్టణమంతా ముందు నడుస్తూం డగా 10, 15 వేలమంది ప్రజల్తో సాయంత్రిందాకా ఊరేగి, షుమారు 900 రూపాయిలు గాంధీ పూజా నిధికి వసూలుచేసి, 6 గంటలకల్లా మైదానంలో సభని ప్రారంభించాడు. తేలిగ్గా 10 వేలమంది జనం ఆ సందర్భంలో గుమిగూడారు. పోలీసుదళం రోడ్లంబడి అల్లరి జరక్కుండా బందోబస్తు చేస్తూవుంది. ముసుగు పోలీసు లెందరో గోపాలకృష్ణుని చుట్టూ తిరగసాగారు. అదంతా గ్రహించిన గోపాలకృష్ణుడు సభికుల నుద్దేశిస్తూ 'చూడండి! నిన్న మీరు చేసిన వనంతా చాలా పిరికితనాన్ని తెలుపుతోంది; యీనాడువచ్చిన మన విధవతోబుట్టువులు (సి. ఐ. డి లు)కూడా, నిన్న, లక్ష్యం

చెయ్యలేదంటే, మీ కార్యంమీద వాళ్ళకెట్టి అభిప్రాయం ఉందో తేల్తోంది. చేసేపనేదైనా నిశ్చితాభిప్రాయంతో చేస్తే, తప్పక విజయం చేకూరుతుంది'. అని, ఓ పెద్ద గంభీరోపన్యాసం చేసి సభను జయప్రదంగా నడిపాడు. ఇలాంటి ఘట్టాలు గోపాలకృష్ణుని జీవితంలో అనేకాలున్నై. ఇంతకంటె యెక్కుడుగా వెలుగులోనికి రానీలులేకుండా, అతణ్ణి కాంగ్రెస్ అధికారపదవి అణచేసిం దనుకోవటం అన్యాయంకాదు.

1924 అంతా గోపాలకృష్ణుడు యెక్కువగా కాంగ్రెస్ తత్వాన్ని ప్రచారం చేస్తూగడిపాడు. జులైలో, ఆంధ్ర రాష్ట్రీయ కాంగ్రెస్ సంఘంలో ఉపన్యసిస్తూ, కాంగ్రెస్ అధికారవర్గంలో ఉన్న కుళ్లునంతనీ బైటపెట్టి, దాన్నెలాగైనా బాగుచెయ్యాల్సిందని పెద్దలకువిన్నవించుకున్నాడు. ఆ విన్నపం కొందరికి కష్టాన్నే కలిగించింది. అది గ్రహించి, అతడు మాట్లాడకుండా అక్కడనుంచి వెళ్ళి

పోయి, తన సభ్యత్వానికి రాజీనామాయిచ్చాడు. 24 జులై మొదలుకుని 25 జులై వరకూ ఒకసంవత్సరంపాటు ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్‌సంఘానికి సహాయకార్యదర్శిగా యెన్నుకోబడ్డాడు; కాని 11 నెలలు గడవకముునుపే, అతని స్వతంత్రాభిప్రాయాలను అసహ్యించుకునే పెద్దలు జూన్ 1925 లో అతడి నాపదవినుంచి తొలగించారు.

ఆలమూరులో, ఏప్రియల్ నెలలో, జిల్లాసేవకదళ సమావేశంలో అధ్యక్షోపన్యాసం గావిస్తూ, హిందువుల శౌర్యానికి చిహ్నమైన యెర్రబొట్టు ముఖంమీద మాసిపోయి దానిస్థానంలో బానిసత్వానికి దుర్యశానికి చిహ్నంగా నల్లనిచుక్క ఉంచబడుతోందనీ, ఎలాగైనా పూర్వపు ఆచారాన్నే నిలబెట్టే ప్రయత్నాలు చెయ్యాలనీ సలహాలిచ్చాడు.

ఈ సమయంలో గోపాలకృష్ణునికి అసహాయోద్యమంలో నాయకత్వంవహించిన పెద్దలమీదఉన్న అభిప్రాయాన్ని గ్రహించటం అసందర్భంకాదు. తప్పుఉన్నచోట ఖండించకుండా అతడెప్పుడూ వదిలిపెట్టడు. పెద్దలెవరూ ఒప్పుకోకపోవచ్చు, కాని అతని అభిప్రాయాన్నిమాత్రం అడ్డడానికి తగినశక్తి ఏలోకంలోనూ కనిపించదు.

ఓసారి; "గాంధిదేవునిరాక కంచుఢక్కలగాక
కరతాళశబ్దాల దరువుగోరె
దేశబంధుని దశ ల్దివసాలతో దీరె
రాజగోపలచారి బూజుపట్టె
కొండెంకటప్పన్న ఉండిలేకుండెను
భాయిపటేళ్ళు నిర్భాగ్యులైరి
లాలజవర్లాయి తోలుపోయెను శ్రద్ధ
చండి సరోజిని పండిపోయె
అలీలు గోలీలు కేళీసవాల్ మాని
ఖాళీగ తాలీల పాలబడిరి
జమ్నలాలూ పెట్టి తుమ్మువీమూబట్టి
ఖద్దరుఖాన్ సబ్ సర్దుచుండె

"మొదటికాకిడి కింతటి మోమాసయో,
ఖ్యాతికొక్కడునిల్చె మామోతిలాలు
ముందుగతులెట్టులౌనో ఖామందు వీవు"

అని వాళ్లని మెత్తిపొడుస్తూ దైవాన్ని ప్రార్థించాడు; వారి వారి తత్వాలు మార్చాల్సిందని.

1924 మే నెలలో, కోవ్వూరులో శ్రీరామ సప్తాహం బహుఘనంగా జరిగింది. అక్కడికి గోపాలకృష్ణుడు తన రామదండు పరిచారం జరపాలని వెళ్లాడు. ప్రతిదినం తన సైన్యం అందరికీ, వ్యాయామంలోనూ, ఉపన్యాసాల్లోనూ, భజనల్లోనూ, సాయంచేస్తూ, అక్కడికొచ్చిన అందరికీ తనఆశయాన్ని గూర్చి వివరించిచెప్పాడు. శ్రీ స్వామి శ్రద్ధానందులవారు కూడా ఓనాడా సైనిక శిక్షణచూసి ఆశ్చర్యపోయి అభినందించారంటే, గోపాలకృష్ణుడెంతటి క్రమపద్ధతిని ఆ ఉద్యమాన్ని సాగించాడో అర్థమౌతుంది.

అఖిలభారతకాంగ్రెసు కార్యవర్గసంఘానికి గోపాల కృష్ణుడు కార్యదర్శిగా ఉన్నరోజుల్లో చేసినపని, పదవుల్లో ఉండి యేమో చేసేస్తామనుకునే అందరి ప్రయత్నాల మాదిరిగానే జరిగింది. పంజాబులోజరిగే అకాలీ పోట్లాటలూ, నాగపూరు పతాక సత్యాగ్రహమూ, కాంగ్రెస్ కార్యవిధానమూ యీ మూడే ప్రముఖస్థానాన్ని ఆక్రమించినై. ఆ రోజుల్లో చిత్తరంజనుని అనుచర వర్గానికీ, స్వరాజ్య సంఘానికి మధ్య రాజీ కుదిరిందంటే ఆగౌరవం గోపాలకృష్ణునికే పోతుంది. కొండంతా త్రివ్వి చుంచుపిల్లని పట్టుకున్నట్టుగా, ఎంతోఆశపడి, మతసామరస్యం కుదురుద్దామనీ, అస్పృశ్యతా నివారణోద్యమాన్ని సాగిద్దామనీ, రాబోయే స్వరాజ్యానికి తగిన పునాదులు వేద్దామనీ ఉవ్విళ్లూరుతున్న అతనికి కాకినాడ కాంగ్రెసులో కనిపించిన ఫలం ఓ ఖద్దర్ బోర్డు నిర్మాణం. అదీకాకుండా, రామదండుకు లభిస్తుందనుకున్న పోషకత్వంకూడా కాంగ్రెసు కార్యవర్గం

వల్ల కలిగిందికాదు. ఆహ్వానసంఘాధ్యక్షుడైన శ్రీ కొండా వెంకటప్పయ్యగారు మాతృభాషను వదిలిపెట్టి అన్యభాషలో మాట్లాడటం ఒకటీ, సప్తాహంలాగా ఆ కాంగ్రెసు సమావేశసమయంలో అందరికీ అన్నదానం— అతని కోరికప్రకారం— చెయ్యకపోవటం ఒకటీ, ఈ రెండూకూడా గోపాలకృష్ణయ్యకు మంచి కష్టాన్ని కలిగించినై. మరుసటివత్సరం ఎన్నికలు జరిగేనమయంలో అతడు పంజాబులోవున్నాడు. అతడు దేశంలోనేవుంటే తప్పకుండా తిరిగి ఎన్నుకోబడేవాడు. కాని, అలాజరిగిందికాదు. అప్పటినుంచీ అతడిమార్గమే మారిపోయింది. కాంగ్రెసులో యెక్కువ బాధ్యత వహించటం తన పొరబాటేననీ, తనను కాంగ్రెసు యేనాడూకూడా, తృప్తిపరచలేదనీ, అసలు కాంగ్రెస్ అధికారవర్గంలో చేరటమే తన బుద్ధిపొరబాటనీ అతడు దృఢంగా అందరితోనూ చెప్పేవాడు. అతనికి మిగిలిన నాలుగేళ్లూకూడా అలాగే ఆచరించుకున్నాడు.

1924 మే మాసంలో గాబోలు గోపాలకృష్ణుని ఆరోగ్యం క్షీణించిపోసాగింది. మలేరియాజ్వరం అతణ్ని పీల్చి పిప్పిచేసెయ్య సాగింది. మలేరియాలోంచి ఉబ్బసం ఉద్భవించింది. సేవచేసే మహాత్ములూ, ధనసహాయంచేసే ఉదారులూకూడా కఱవైనారు. తిరుచునాపల్లిజైల్లో ఉన్నసంవత్సరం మాత్రం కొద్దిగా ఆరోగ్యం కలిగే చిహ్నాలు కనిపించినై. అంతే, తిరిగి జబ్బుయథాస్థితిలోకి వచ్చింది. ఫలానారోగం అని నిర్ణయించగల వైద్యులే కనబడలేదంటే, అతడిజీవితం అంతిమదశలో యెంతగా కృశించిపోయిందో తెలుస్తుంది. ఆంధ్రదేశ సంచారమనీ, కాంగ్రెస్ సమావేశాలకు హాజరుకానటమనీ అలా అలా తిరిగి, ఆరోగ్యాన్ని లక్ష్యం చేసుకోవకపోనటం మూలాన కలిగిన ఆపద అతనికప్పుడు అర్థమైంది. అతని స్నేహితులుకొందరు, 1926 అక్టోబరునెల 27 వ తేదీన అతణ్ని మద్రాసు జనరల్ ఆసుపత్రిలోచేర్చారు. ఉదయానచేర్చి, భోజనానికి

యింటికి వెళ్ళేటప్పటికల్లా అక్కడ ప్రత్యక్షమై "నాయ నలారా నన్నెక్కువగా బాధపెట్టకండి, అంతగాకావా లంటే ఖైదుకన్నా పోతానేగాని తిరిగి వైద్యాలయానికి వెళ్లను,' అని మొఱపెట్టుకున్నాడు. అతని అభిప్రాయ ప్రకారం, ఆంగ్లేయవైద్యాన్ని మానేసి, ఆయుర్వేద యునానీ వైద్యాలుచేయించారు; మిత్రులు. ఆసంవత్స రమే కొంతకాలం మంగళగిరిలో గడిపాడు. దైవసాన్ని ధ్యంలోఉండి చివరిరోజులు వెళ్లబుచ్చుదామని నిశ్చ యించుకున్న గోపాలకృష్ణుడు ఆరోజుల్లోనే రామనగ రంలో రెండు దేవాలయాలు నిర్మించటానికూడా పునాదులువేశాడు. దేశోద్ధారకుడని పేరుపొందిన కాశీనాథుని నాగేశ్వరరావుగారు ఆ మహాత్కార్యానికి రు 116 లు పంపి కొంతసహాయంచేశారు. అప్పటికీ దైవం అతడ్ని పరీక్షించటం మానలేదు. తినడానికి తిండిలేని స్థితిలో ఉండికూడా తనభార్య ఒంటిమీది నగలూ, తనస్వంత వెండికంచమూ రెండూఅమ్మి, ఆ

దేవాలయాన్ని పూర్తిచేశాడంటే అతని చరమదశలో వడ్డపాట్లు పూర్వజన్మ దుష్కృతఫలాలే కాని వేఱుకావని మనకు నమ్మకం కుదురుతుంది. పేదతనంతో అల్లాడిపోయే రోజుల్లోనే, (1922 లో) గయలోజరిగే జాతీయ మహాసభకు వెళ్లాడంటే అతని ఆరోగ్యం, ధనం యావత్తూకూడా దేశసేవకే ఉపయోగించాడని తేల్తుంది. ఈ సందర్భంలో మరోవిషయం గుర్తుకు వస్తుంది. కాశీలో అతడున్న రోజుల్లో, అతనిభార్యకు జబ్బుచేసి ఆశలువదులుకునేస్థితికి దింపింది. అక్కడ మన తెలుగువాళ్లంటేనే అభిమానించే ఓ గౌరవనీయుడు వాళ్లను దగ్గరకుచేర్చుకుని, చేయగలసహాయమంతా చేశాడు. సరే...ఒకరోజున కాళ్లుచల్లబడ్డై. క్రింద బెట్టారు. ధారకం యిందటంలేదు. ఇల్లంతాగొల్లుమన్నారు. అంతట్లో, ఓసన్యాసి ఆయింటిదగ్గిరగా పోతూ ఆ ఆర్తనాదంవిని, ఆగి, యింట్లోకిపోయి,

కారణం కనుక్కొని తనదగ్గరేఉన్న ఓ అమృతగుళిక నిచ్చి అరగతీసిపొయ్యమని చెప్పాడు. ఆ యింటిపెద్ద అలా చేసీ చెయ్యటంతోనే, ఆ అమ్మలో మంచి తేజం కనిపించింది. ధారకంపోశారు; బాగా యుందింది. మరో అరగంట చూశారు; లేచికూర్చుంది. వాకిటి వైపు ఆ సన్యాసికై వెతికారు... పట్టణమంతా గాలించారు... కనిపిస్తాడా... ఆపదోద్ధారకుడు... అంతే... అది విన్నవాళ్లకీ చూసినవాళ్లకీ కూడా విశ్వేశ్వరుడే ఆ రూపంలోవచ్చి గోపాలకృష్ణుని సంసారాన్ని, యింటి దీపాన్ని నిలబెట్టాడనిపిస్తుంది; యదార్థమెంతోగాని... జరిగిందది. భక్తి అంటే అతనిదే. మంగళగిరినుంచి యింటికివస్తూ.

ఉ॥ "ఎండలకోర్వలేక యిటులింటికివచ్చితి నంతెకాని, నీ
యండనువీడలేదు, భవదంఘ్రియుగమ్మునసదామదీయ హృ
న్మండలినిల్పినాడ, ననుమానమువీడవె, నాదుబాధ్యమున్
కొండవె, మంగళాద్రినరశింహ! సుధాలయ! పానకాలయా!

ఎండలకోర్వలేక జమి యింటికివచ్చితి మంగళాద్రికిన్
కొండవసాటి రామనగరీక్షితియంచును దొల్లి త్రేత కా
లాండవు రామచంద్రవిమలాకృతితో నటునీవ కావె మా
కండగ నిల్చిపోతువు శుభాద్రినృశింహాయ ! పానకాలయా !

అని యెంతగానో దీనంగా మనవిచేసుకున్నాడు. ది 26-5-27 న ఓ మిత్రునికి తనస్థితిని... "నాదగ్గర దమ్మిడీకూడా లేదు. యింట్లో బియ్యంకూడా ఐపోయినై. ఆరోగ్యం యథాప్రకారంగా జబ్బుగానేఉంది. రామచంద్రునిమీదనేభారంవేసి బ్రతుకుతున్నా"నని వ్రాసుకున్నాడు.

ఆ రోజుల్లో యెక్కడ చావడమూ అన్నదో ప్రశ్న ఐందతనికి. నేను గృహస్థుగా నేచావబోతున్నాగదా, గృహం అనేదే లేందే నాకాపేరు ఎలా ఒప్పుతుంది; అనుకుని, తన భూమిలో కొంతభాగాన్నీ, మరికొన్ని సొంతపుస్తకాలనీఅమ్మి గుంటూరులో ఊరికి చివరగా ఓ పర్ణశాలను

నిర్మించుకున్నాడు. లేచితిరిగే శక్తిలేనప్పటికీ, అక్కడ ఉండే షుమారు 300 మంది సంసారులనీపిల్చి, చేతిలో ఉన్న నలభైరూపాయిలూ వ్యయించి ది 21 మే, 1928 న గృహప్రవేశమహోత్సవంజరిపాడు.

జూన్ 10 వ తేదీ వచ్చింది. అమరలోకంనుండి ఆహ్వానం వచ్చింది. సాయంత్రం 5 గంటలదాకా అంతా సవ్యం గానే జరిగింది. దీపాలుపెట్టిం తరువాత వైద్యుడువచ్చి చెయ్యిచూస్తుంటే, గోపాలకృష్ణుడు, "అయ్యా! నాకిప్పటి కైనా నిజం చెప్పండి. నాకుమాత్రం బ్రతకాలని లేదు. ఐనా, ముందుగా తెలిసిఉంటే కొద్దిదైవప్రార్థన నైనా చేసుకుంటాను. ఈరాత్రి అంతా నా ప్రాణా లుంటయ్యా... ఉండవా...?" అని ప్రశ్నించాడు. వైద్యుడు తన కులధర్మప్రకారం "ఏమీఫరవాలేదండి!" అని బొంకేశాడు. ఆ మాటల్లోఉన్న నిస్పృహని గోపాలకృష్ణుడు కనిపెట్టి, వెంటనే, వైద్యుడు వద్దంటు

న్నా లేచి, దగ్గరలో ఉన్న చాప తెచ్చుకుని, ప్రక్కగా వేసుకుని, అవసరపడ్డప్పుడు ఆలశ్యం చెయ్యకుండా దాని మీద తనను పడుకో పెట్టాల్సిందిగా అందరికీ చెప్పాడు. రాత్రి 10 గంటలైంది. చెంతకెవరూ వెళ్ళలేనంతగా బాధపడ మొదలుపెట్టాడు. మళ్లో పదినిముషాలకి ఎక్కడలేని ఆయాశం, కఫం చుట్టుకున్నై. ఊళ్ళోంచి పెద్దపిన్నలందరూవచ్చి ఆదివ్యవిగ్రహాన్ని తుదిసారి దర్శిద్దామని చేరారు. చాపమీదఉండే, జనంవంక ఓసారి తీక్షణంగాచూసి, తన జీవితాదర్శాన్ని మాత్రం మరచిపోకుండా నిలబెట్టాలిసిందని ఆజ్ఞాపించినట్లుగా తలమెత్తి దింపేశాడు. 10-45 నిముషాలకి ఆరాత్రి సమయంలోనే అతనిప్రాణి అంతర్థానమైంది.

అతని మృతకళేబరాన్ని పెద్ద ఊరేగింపులో, ఊరిజనమంతాహారతులిస్తూవుండగా, చీనాలపేరాలలమీదుగా తీసుకుపోయి, రామనగరంలో వైదికధర్మప్రకారం

అంత్యక్రియ లాచరించారు. ఈనాటికీ కూడా రామ నగరంలో గోపాలకృష్ణుని ఆత్మ ప్రతిగృహంలోనూ నస్థానే ఉంటుంది. అదే అతని మహాత్మ్యం. ఈవిధంగా, నేటికేగాక మరెన్నిశతాబ్దాలకైనా మఱపు రాని గోపాలకృష్ణుని జీవితం అంతమైంది. భౌతి కంగా అతడు మనలోకంలో కనిపించకపోయినా అతని సందేశాన్నీ ఆశయాలనూ విన్నవాళ్లెవరూ అతన్ని కోలుపోయినట్లుగా భావించరు. ఆదర్శజీవితంఅంటేనూ, ధన్యజీవితమంటేనూ గోపాలకృష్ణునిదేఅని అందరూ ఒప్పుకుంటారు.

—స్వస్తి శ్రీకృష్ణార్పణమస్తు—



తెలుగునాడు కార్యాలయంవారు, యీ రచనకు తమ కెంతో సాయంచేసిన బ్రహ్మశ్రీ గుమ్మిడిదల సుబ్బారావుగారికి కృతజ్ఞులు.





---

65 వ పేజీ మొదలు 91 వరకూ కృష్ణాస్వదేశీ ప్రెస్‌లో ముద్రితము.

ప్రభాత్ ప్రెస్, బందరు.



| | |
|---|---|
| | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPL A104 B116 |
| పుస్తకం పేరు | ఆంధ్ర రత్న దుగ్గిరాల |
| తారీఖు | 25-10-24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 97 |
| పెద్ద సైజు పేజీలు | నో |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | నో |
| తయారు చేసినది | Kasimbi |
| పేజీలు విడదీసినది | kasimbi |
| స్కాన్ చేసినది | Kavced |
| పరీక్ష చేసినది | RAMYA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | నో |
| పరిస్థితి | GOOD |